❋శ్రీపరాశరసంహితా❋

# శ్రీ ఆంజనేయచరిత్ర

త్రయోదశ పారిజాతము



సమర్పణ :

'వైద్యవిద్వాన్,' 'భాషాప్రవీణ' 'హిందీ విశారద'

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి,

M. A. & M. A., P. O. L.

ప్రచురణ :

శ్రీ హనుమత్సేవా సమితి

సత్యనారాయణపురం :: విజయవాడ-520 011.

# గురుపూజ



శ్లో॥ వేదమంత్రగమదిజ్ఞం - పాలపర్త్యన్వయోద్భవం
గురుం చ సుముఖం పూజ్యం - వన్దే సుబ్బావధానినమ్॥

# మీతో ఒక్క మాట ....

హనుమద్భక్తులకు, ఉపాసకులకు నమస్సుమాంజలులు. శ్రీపరాశర సంహిత (శ్రీఆంజనేయచరిత్ర) ఇప్పటివరకు వెలువడిన పటలములలో (భాగములలో) శ్రీహనుమత్స్వామికి సంబంధించిన అనేక అతి ముఖ్యమైన విషయములు వెలువడినవి. ఇవి మీరు పరిశీలించి యుండవచ్చు. మేము అనేక కష్టనష్టములకోర్చి వ్రాతప్రతులు సేకరించి, వాటిని ముద్రణ రూపములో భక్తులకు అందించుచుంటిమి. ఇంకనూ సేకరించవలసిన వ్రాతప్రతులు గలవు. అవి ఎక్కడ ఎవరివద్ద ఉన్నాయో తెలియని పరిస్థితి ఏర్పడినది. శ్రీపరాశర సంహిత మొత్తం 150 పటలములు. ఆ విషయము గట్టి తెలిసినది. అందుకు సందేహములేదు.

ప్రస్తుతము మీ హస్తము లలంకరించిన ఈ 13వ భాగముతో 80పటలముల ముద్రణ జరిగినది. ఇంకా 70పటలముల ముద్రణ జరగవలసియున్నది. ప్రస్తుత 13వ భాగములో 78పటలములో "కవచము" ఎంత ప్రయత్నించినను దొరకలేదు. ఆ కవచమునకు మేము చేసిన కృషి ఆ స్వామికే ఎరుక. ఆ కవచము కొఱకు చేసిన ప్రయత్నములు ఫలించ

నందున కవచము లేకుండా ముద్రించుట జరిగినది. ఈ విషయములో పాఠకులకు కలిగిన అసౌకర్యమునకు చింతిస్తున్నాము. ఆ కవచము దొరికినచో తదుపరి పారిజాతములో తప్పక ముద్రించగలము.

మన సంహితలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి. అందువల్ల సమితి శ్రీహనుమంతులవారికి సంబంధించిన శ్రీ పరాశర సంహితను చేపట్టి, అది పూర్తిగా భక్తులకు అందించాలనే స్థిరనిశ్చయముతో గట్టిగా కృషి చేయుచున్నది. శ్రీపరాశరసంహిత లోకానికి అందించాలనే ఆశయము తప్ప, పుస్తకాలద్వారా వ్యాపారము చేయాలని మాత్రముగాదు. ఈ విషయము చదువరులు సహృదయముతో అర్థము చేసుకోవలసినదిగా కోరుచున్నాము. ఈ "పరాశరసంహిత" ఇంతవరకు ఎవరు ఏభాషలోనూ పూర్తిగా ముద్రించలేదని పలువురు పెద్దల వాక్కు.

ఈసంహిత పూర్తియగుటకు, వ్రాతప్రతులు సేకరించుటలో ప్రతి ఒక్కరి సహకారము అర్థిస్తున్నాము. ఎవరైనా ఉపాసకుల వద్ద మేము ప్రచురించిన తదుపరి పటలములున్నచో మాకు పంపి, స్వామి చరిత్ర వెలువడుటకు సహకరించగోరుచున్నాము. ఒకవేళ వ్రాతప్రతులు పంపుటకు వీలుకలగక పోతే, ఆ విషయము మాకు తెలిపిన మేమే వారి వద్దకు వచ్చి వ్రాసుకొనగలము.

ప్రతి ఆంజనేయ దేవాలయమందు, ప్రతి హనుమద్భక్తుని వద్ద ఉండవలసినదీ పరాశరసంహిత.

ఈ పారిజాతమునకు చేయూతనిచ్చిన దాతలందరకూ కృతజ్ఞతలు తెలుపుతూ, వారినందరినీ శ్రీహనుమత్ప్రభువు అభయమిచ్చి సదా కాపాడవలెనని ప్రార్థిస్తున్నాము.

ఇట్లు
గ్రంథకర్త, ప్రకాశకులు.

వ్రాతప్రతులు వివరము తెలుపవలసిన చిరునామా:


శ్రీ హనుమత్సేవాసమితి
సత్యనారాయణపురం
విజయవాడ - 520011

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి,
M. A & M. A, P. O L
7 - 10 - 5 (1) బి.
లాయరుపేట, ఒంగోలు - 523002

# పితృవందనం



ఈ రూపు నీయఁ గనినా
కీ రీతిగ హసుమ నెంచు నింగిత మిదు సీ
తారామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల పదములఁ గొలుతున్.

— అన్నదానం చిదంబరశాస్త్రి.

# విషయసూచిక




| | | |
|---|---|---|
| 71. | నవఖండ హనూమన్మంత్ర ప్రభావకథనం | 1 |
| 72. | స్తోత్రప్రకారకథనం | 18 |
| 73. | శ్రీపంచముఖ హనుమద్ధృదయం | 32 |
| 74. | శ్రీపంచముఖ హనుమత్పంజరం | 39 |
| 75. | శ్రీహనుమదష్టోత్తర శతనామ స్తోత్రం | 52 |
| 76. | శ్రీవానరగీతా | 57 |
| 77. | హనుమజ్జయన్తి కథనం | 70 |
| 78. | కవచయంత్ర ప్రభావకథనం | 85 |
| 79. | హనుమత్స్తోత్ర రూపనామ కథనం | 86 |
| 80. | సంతాన హనుమన్మంత్రప్రభావాస్త్రప్రయోగ కథనం | 96 |


---


ఈ పారిజాతము కాజీపేట, డిసెల్‌కాలనీలో గల శ్రీ ఆంజనేయ స్వామివారి సన్నిధిన గ్రంథావిష్కరణ జరుపబడినది.

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## శ్రీ పరాశర సంహితా

### ఏకసప్తతి పటలః

### నవఖండ హనూమన్మంత్ర ప్రభావ కథనం

శ్రీమైత్రేయః-

శ్లో॥ పరాశర నమ స్తుభ్యం - సర్వమంత్ర ప్రవర్తకః
స్తోత్రం మంత్రాంతరం మహ్యం - వక్తు మర్హసి సువ్రత॥

తా॥ శ్రీ మైత్రేయ మహాముని యడుగుచున్నారు. సర్వ మంత్ర ప్రవర్తకుడవైన ఓ పరాశర మహామునీ! నీకు నమస్కారము. ఓ సువ్రతుడా! నాకు వేఱొక మంత్రమును గూర్చి చెప్పుము.

శ్రీపరాశరః-

శ్లో॥ ఆదౌ స్తోత్రం ప్రవక్ష్యామి - షణ్ముఖస్య హనూమతః
స్మృతి ర్యస్య విధానోక్తా - సర్వసిద్ధి ప్రదాయినీ।

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. మొదలుగా షణ్ముఖుడగు హనుమంతునియొక్క స్తోత్రమును చెప్పుచున్నాను. విధానము ననుసరించి దీనిని స్మరించుటవలన నిది సర్వ సిద్ధుల నీయగలదు.

శ్లో॥ ధ్యాయే త్తపనవర్ణాభం - ప్రాఙ్ముఖం వానరాననం
కల్పవృక్ష మిమం జ్ఞేయం - సర్వాభీష్టఫల ప్రదమ్॥

తా॥ షణ్ముఖుడగు హనుమంతుని ఈ రీతిగా ధ్యాన మొనర్చవలెను. పూర్వ ముఖము వానర ముఖమై సూర్యుని వర్ణముతో సమాన

ముగా నుండు రూపము భక్తుల కోరికలన్నిటిని దీర్చు కల్ప వృక్షముగా తెలిసి కొనవలెను.

శ్లో॥ దక్షిణం తు నృసింహాఖ్యాత - రక్తమాణిక్య సన్నిభం
చింతామణిసమం తచ్చ - చింతితార్ధ ప్రదాయకమ్॥

తా॥ దక్షిణ భాగమందలి నరసింహ ముఖము ఎఱ్ఱని మాణిక్య ముతో సమానమైనది. భక్తులు కోరిన కోర్కెలు తీర్చు నట్టిది చింతా మణితో సమానమైనది.

శ్లో॥ శుభ్ర వజ్రసమ ప్రఖ్యం - పశ్చిమం గరుడాననమ్
సుధాకుంభస మాకారం - నానావిషహారం పరమ్॥

తా॥ పశ్చిమభాగమున నుండు గరుడ ముఖము శుభ్రమగు వజ్ర ముతో సమానమైనది. అమృత కుంభము వంటి అది సర్వ విషములను హరించునది.

శ్లో॥ ఇంద్రనీల సమానాభం - వరాహానన ముత్తరం
తుల్యం నవ విధానై శ్చ సర్వసంప త్ప్రదాయకమ్॥

తా॥ ఉత్తరభాగమునందలి వరాహ ముఖము ఇంద్రనీల మణితో సమానమైన శోభకలది. అది నవ నిధులతో సమానమై సర్వ సంపదల నిచ్చునది.

శ్లో॥ ఊర్ధ్వం హయముఖం జ్ఞేయం - గారుత్మత మణిప్రభం
కామధేనుస మాకారం - సర్వవిద్యా ప్రదాయకమ్॥

తా॥ ఊర్ధ్వభాగముననుండు అశ్వ ముఖము గరుడ పచ్చల కాంతి కలది. సకల విద్యల నొసగు ఆ ముఖము కామధేనువుతో సమానమైన ఆకారము కలది.

శ్లో॥ ధ్యాయే త్పింగళవర్ణం తు - పాతాళే పావకాననం
పద్మరాగసమ ప్రఖ్యం - వర్చో బల యశః ప్రదమ్॥

తా॥ పాతాళదిశగా అగ్నిముఖమును పింగళవర్ణము కలదానిని ధ్యానించవలెను. పద్మరాగముల కాంతితో సమానమగు కాంతిగల ఆ ముఖము వర్చస్సును, బలమును, కీర్తిని ఇచ్చునట్టిది.

శ్లో॥ ఇమం స్తవం పఠే ద్యస్తు - షణ్ముఖస్య హనూమతః
సర్వాపద్భ్యో విముచ్యేత — స ధ్రువం విజయీ భవేత్॥

తా॥ ఈ షణ్ముఖ హనుమత్ స్తవమును ఎవరు పఠింతురో వారు ఆపద లన్నిటినుండి తొలగి విజయము నందగలరు.

శ్లో॥ అన్యం మంత్రం ప్రవక్ష్యామి - శృణుష్వ మునిపుంగవ ।
పంచదేవాత్మకం మంత్రం - హనూమన్మంత్ర ముత్తమమ్॥

తా। ఓ మైత్రేయమహాముని ! పంచదేవాత్మకమైన వేఱొక హనుమన్మంత్రమును ఉత్తమమగు దానిని చెప్పుచున్నాను వినవలసినది.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - శ్రీబీజం తదనంతరం
నల నీల పదే చోక్త్వా - జాంబవత్పద ముచ్చరేత్॥

తా॥ మొదట ప్రణవము నుచ్చరించి అనంతరము శ్రీం అను బీజమునుంచి నల నీలపదముల నుచ్చరించి పిదప జాంబవత్పదము నుచ్చరించవలెను.

శ్లో॥ సుగ్రీవ హనుమచ్ఛబ్దే - వారాహం బీజ ముచ్చరేత్
ఫట్ స్వాహేతి శబ్దేన - వింశద్వర్ణ మను స్స్మృతః॥

తా॥ సుగ్రీవ హనుమచ్ఛబ్దముల నుచ్చరించి గ్లాం అను వారాహ బీజము నుచ్చరింపవలెను, పిదప ఫట్ స్వాహా అని చెప్పగా అది ఇరువది అక్షరముల మంత్రమగును,

శ్లో॥ నవఖండ హనూమంతం - వక్ష్యామి మునిపుంగవ !
సర్వలోక హితార్థాయ - సర్వభూత దయాపర !॥

తా॥ సర్వ ప్రాణులయందు దయగల ఓ మునిశ్రేష్ఠా! సర్వ లోకములకు శ్రేయస్సు కల్గుటకై నవఖండ హనుమన్మంత్రమును చెప్పుచున్నాను.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - శ్రీబీజం తదనంతరం
నమో భగవతే పశ్చాత్ - శ్రీబీజం చ తతః పరమ్॥

తా॥ మొదట ప్రణవము నుచ్చరించి తరువాత శ్రీం అను బీజము నుంచి పిదప నమో భగవతే అనిన పిమ్మట శ్రీకారము నుచ్చరింప వలెను.

శ్లో॥ హనూమతే తతో బ్రూయాత్ - పదం వానర సంజ్ఞితం
నృసింహ తార్క్ష్య వారాహ - హయ పావక సంజ్ఞితమ్॥

తా॥ పిమ్మట హనూమతే అని వానర నృసింహతార్క్ష్య వరాహహయ అగ్ని శబ్దములను చెప్పవలెను.

శ్లో॥ షణ్ముఖోపపదం బ్రూయాత్ ధరాయేతి పదం తతః
సహస్రభుజ శబ్దం చ - సహస్రాయుధ శబ్దకమ్॥

తా॥ షణ్ముఖ అని పల్కి ధరాయ అని పిదప చెప్పవలెను. సహస్ర భుజ శబ్దమును సహస్రాయుధ శబ్దమును

శ్లో॥ యధా క్రమం సముచ్చార్య - ధరాయేతి పదం తతః
సముచ్చరే త్తతో బ్రూయా - త్కోలాహల పదం తతః

తా॥ క్రమముగా చెప్పుచు వాని పిదప ధరాయ అనునది క్రమంగా చెప్పవలెను. పిదప కోలాహల పదము నుంచవలెను.

శ్లో॥ మహాభైరవ శబ్దం చ - యకారం చోచ్చరే త్తతః
సకలేతి పదం చోక్త్వా - శత్రుసంహరణేతి చ॥

తా॥ మహా భైరవ శబ్దము నుంచి పిదప యకారము నుచ్చరించి అనగా 'మహా భైరవాయ' అని పిదప సకల అను పదము పలికి శత్రు సంహరణ అను పదముపై

శ్లో॥ యకార ముచ్చరే ద్ధీమాన్ పదం భక్తజనేతి చ
రక్షణాయ పదం తత్ర - సహస్రాశ్వపదం తతః॥

తా॥ బుద్ధిశాలియగువాడు యకారము నుచ్చరించవలెను. అనగా 'శత్రుసంహరణాయ' అనవలెననుట. అనంతరము 'భక్తజన' అని అట 'రక్షణాయ' నుంచిన పిమ్మట 'సహస్రాశ్వ' పదము నుంచదగును.

శ్లో॥ రథ వాహన శబ్దం చ - యకారం తు సముచ్చరేత్
సువర్చలా ప్రియాయేతి - బ్రూయా చ్ఛ్రీవర్ణ పూర్వకమ్॥

తా॥ 'రథ వాహన' శబ్దమునుంచి యకారము నుచ్చరించవలెను. అనగా 'సహస్రాశ్వరథ వాహనాయ' అని యనవలెననుట. శ్రీ సువర్చలా ప్రియాయ అని పలుకవలెను.

శ్లో॥ అనేకయువతీ శబ్దం - సహితాం సముదీరయేత్
దేవ నదీ పదం పశ్చా - ద్విహారాయ పదం తతః॥

తా॥ అనేక యువతీ శబ్దమును, సహితా శబ్దమును పలుకవలెను. దేవనదీ పదమును పల్కిన వెనుక విహారాయ అని చెప్పవలెను.

శ్లో॥ సకలేతి పదం పశ్చా - దుచ్చరే చ్చ ప్రయత్నతః
మనోరథా నితి - బ్రూయా న్మహ్యం దేహి పదం తతః॥

తా॥ సకల అను పదము నుచ్చరించి పిదప ప్రయత్న పూర్వకముగా 'మనోరథాని' అను పదము పలుకవలెను. అటుపిమ్మట 'మహ్యం దేహి' అను పదముల జెప్పవలెను,

శ్లో॥ పున ర్దేహిపదం చోక్త్వా - వహ్నిజాయాం సముచ్చరేత్
ఋషి బ్రహ్మ స్య మంత్రస్య - గాయత్రీ ఛంద ఉచ్యతే॥

తా॥ మరల 'దేహి' పదము పల్కి 'స్వాహా' అనవలెను. ఈ మంత్రమునకు బ్రహ్మ ఋషి గాయత్రీ ఛందస్సుగా చెప్పబడుచున్నవి.

శ్లో॥ నవఖండ హనుమాం శ్చ - దేవతా పరికీర్తితః
ప్రణవో బీజ మి త్యుక్తం - స్వాహా శక్తి రుదీరితా॥

తా॥ 'నవఖండ హనూమాన్' దేవతగా కీర్తింపబడుచున్నాడు, 'ఓం' బీజము స్వాహా శక్తియు చెప్పబడినవి.

శ్లో॥ శ్రీ బీజం కీలకం తత్ర – ప్రసాదే వినియోజనం
న్యాసం కృత్వా విధానేన – మూలమంత్రో విధానతః
ధ్యానం కృత్వా ప్రయత్నేన – సర్వకామార్థ సిద్ధయే॥

తా॥ శ్రీ బీజమే దానికి కీలకము. హనుమత్ప్రసాదమునందు వినియోగము చెప్పవలెను. మూలమంత్ర విధానముతోనే న్యాసమొనర్చి సర్వకామార్థ సిద్ధికొఱకు ప్రయత్నపూర్వకముగా ధ్యాన మొనర్చవలెను.

ధ్యానం :-

శ్లో॥ నవఖండ హనూమంతం – హేమ రంభావ నాశ్రయం
సమస్త జగదాధారం – ధ్యాయే ద్వాంఛిత సిద్ధయే॥

తా॥ బంగరు అరటితోటలు ఆశ్రమముగా కల్గినట్టి, సమస్తజగత్తునకు ఆధారభూతుడై నటువంటి నవఖండ హనుమంతుని కోరికలు నెరవేరుటకై ధ్యానించుచున్నాను.

గ్రంథాంతరే ధ్యానం :-

శ్లో॥ పూర్వస్యాం దిశి వానరాస్య మనిశం శ్రీమ న్నృసింహాననం
భూయో దక్షిణదిక్తలే కపివరం తార్క్ష్యాననం పశ్చిమే
క్రోడాస్యం తద నూత్తరే దిశి యజే దూర్ధ్వం
హయాస్యం తతః
పాతా లేఽగ్నిముఖం చ షణ్ముఖ మితిధ్యాయే ద్ధనూమత్ప్రభుమ్॥

తా॥ తూర్పు దిక్కున వానర ముఖమును, దక్షిణ దిక్కున నృసింహముఖమును, పశ్చిమమున గరుడముఖమును, ఉత్తరదిశ వరాహ ముఖమును ఊర్ధ్వమున అశ్వముఖమును అథోముఖముగ అగ్నిముఖమును కల్గిన షణ్ముఖుడగు హనుమత్ప్రభువును ధ్యానముచేయుచున్నాను.

శ్లో॥ నవఖండ హనూమంతం - జపే త్సర్వార్థ సిద్ధయే
ఇ త్యామనంతి మునయః ఇతిహాసేషు సర్వశః॥

తా॥ సమస్తములైన కోరికలు నెరవేరుట కొఱకు నవఖండ హనుమన్మంత్రమును జపించవలసినదిగా ఇతిహాసము లందంతట మునులు చెప్పుచున్నారు.

శ్లో॥ అముష్య మంత్రరాజస్య - నవఖండ హనూమతః
అక్షరాణాం తు సంఖ్యోక్తా - వింశ త్యష్టోత్తరం శతమ్॥

తా॥ ఈ నవఖండ హనుమన్మంత్ర రాజమునకు అక్షరముల సంఖ్య నూటిరువది ఎనిమిదిగా చెప్పబడినది.

శ్లో॥ సమస్త మంత్రజాలేషు - సర్వోత్కృష్టో హ్యయం మనుః
సర్వపాప క్షయకర - స్సర్వోపద్రవ నాశనః॥

తా॥ సమస్త మంత్రములయందు ఈ మంత్రము అన్నిటిని మించినది. పాపములన్నిటిని నాశన మొనర్చునది. ఉపద్రవము లన్నిటిని పోగొట్టునది.

శ్లో॥ భుక్తి ముక్తి ప్రదో నౄణాం - సర్వైశ్వర్యప్రదో మనుః
యం యం కామయతే లోక స్తత్త త్కామప్రదో మనుః॥

తా॥ ఈ మంత్రము మనుజులకు ఇహమున భుక్తిని, పరమున ముక్తిని, ఇచ్చునదై సర్వైశ్వర్యముల ప్రసాదించునది. జనులేయే కోరికలు కోరెదరో వాని నన్నిటినీ ఇచ్చునదీ మంత్రము.

శ్లో॥ ఇతిహాసం ప్రవక్ష్యామి - శృణుష్వ మునిపుంగవః
యస్య శ్రవణమాత్రేణ - సర్వైశ్వర్య మవాప్నుయాత్॥

తా॥ ఓమైత్రేయ మహామునీ! ఒక గాథను చెప్పుచున్నాను. వినవలసినది. దీనిని వినుట వలననే సర్వైశ్వర్యములు చేకూరును.

శ్లో॥ కార్తవీర్యార్జునః పూర్వ - మిమం మంత్రం సదా జపన్
జిగా యాష్టాదశ ద్వీప నవఖండాత్మికం భువమ్॥

తా॥ పూర్వము కార్తవీర్యార్జునుడీ మంత్రము నెల్లప్పుడు జపించుచు పదునెనిమిది ద్వీపములు, తొమ్మిది ఖండములు కల భూమిని జయించెను.

శ్లో॥ ఇంద్రఖండం తామ్రఖండం - నాగఖండం తథైవ చ
గభస్తిఖండం సౌమ్యం చ- గాంధర్వంఖండ మేవ చ॥

తా॥ ఇంద్ర ఖండము, తామ్రఖండము, అట్లే నాగ ఖండము గభస్తి ఖండము, సౌమ్యఖండము, గాంధర్వఖండము,

శ్లో॥ సప్తమం చాప్సరః ఖండం - అష్టమం చామరం తథా
నవమం భారతం ఖండం - నవఖండా న్యనుక్రమాత్॥

తా॥ ఏడవది అప్సరః ఖండము, అట్లే ఎనిమిదవది అమర ఖండము, తొమ్మిదవది భారత ఖండము అని క్రమముగా తొమ్మిది ఖండములు.

శ్లో॥ తదా ప్రభృతి లోకేషు - మంత్రరాజ మిమం మనుః
నవఖండాత్మికా విద్యా - మిత్యాహు ర్మంత్రవేదినః॥

తా॥ అప్పటినుండి లోకములందీ మంత్ర రాజమును నవఖండాత్మిక విద్యగా మంత్రవేత్తలు పల్కిరి.

శ్లో॥ పఠన్ జపన్ ఇమం మంత్రం - ముచ్యతే భవబంధనాత్
ఇహలోకే సదా జంతు - ర్మహ దైశ్వర్య మాప్నుయాత్॥

తా॥ ఈ మంత్రమును పఠించుచు జపించుచు ఇహమున ఎల్లప్పుడు జనులు మహదైశ్వర్యమును పొందగలరు. పరమున సంసార బంధము నుండి మోక్షము లభించును.

శ్లో॥ యత్ర యేషాం తు మంత్రాణాం - జపసంఖ్యా న విద్యతే
తత్ర తేషాం జపే ష్వేవ - శతసంఖ్యా నియమ్యతే॥

తా॥ ఎక్కడ ఏ మంత్రములకు జపసంఖ్య చెప్పబడదో అక్కడ ఆయా మంత్రముల జపసంఖ్య వంద యని నియమము.

శ్లో॥ న కాలనియమో యేషాం దినసంఖ్యా న గణ్యతే
తేషాం రాత్రి ర్జపే కాలః - దివసా ద్వాదశ స్మృతాః॥

తా॥ ఏ మంత్రములకు కాలనియమము జపించవలసిన రోజుల లెక్క తెలియచేయబడదో అటువంటి వానికి రాత్రియే జప కాలము. పండ్రెండు రోజులు నియమముగా తెలిసికొననగును.

శ్లో॥ యత్ర మంత్రిత భస్మాదిః - జలస్య న తులోచ్యతే
ఫలమాత్రం జలం తత్ర - భస్మామలక మాత్రకమ్॥

తా॥ఎక్కడైతే మంత్రింపబడెడు భస్మమునకు, జలమునకు కొలత చెప్పబడదో అక్కడ మూడు రూపాయల ఎత్తు జలమును, ఉసిరికాయ మాత్రపు భస్మమును స్వీకరింపవలెను.

శ్లో॥ చూర్ణం చార్థఫలం జ్ఞేయ - మితి మంత్రవిదో విదుః

తా॥ చూర్ణమైనచో రూపాయిన్నర ఎత్తు మాత్రము స్వీకరింప వలెనని మంత్రవేత్తలు చెప్పుచున్నారు.

శ్లో॥ హోమసంఖ్యా విశేషేణ — న యత్ర గణితా యది
విధానం తత్ర విజ్ఞేయ - మష్టావింశతి సంఖ్యయా॥

తా॥ విశేషించి హోమసంఖ్యను ఎక్కడ చెప్పరో అక్కడ ఇరువది యెనిమిది సంఖ్యను హోమమునకు తీసుకొనుటే నిర్ణయము.

శ్లో॥ తర్పణస్య న సంఖ్యోక్తా - యత్ర చైవ మహామునే।
నియమ స్తత్ర విజ్ఞేయః - కథితో హోమసంఖ్యయా॥

[2]

తా॥ ఓ మైత్రేయమహామునీ! ఎక్కడ తర్పణసంఖ్య చెప్పబడదో అక్కడ హోమసంఖ్యను బట్టియే తర్పణ విధానమని తెలియదగును.

శ్లో॥ బ్రాహ్మణానాం న సంఖ్యోక్తా - యత్ర బ్రాహ్మణభోజనే
తత్ర భోజయితవ్యా శ్చ - విప్రా ద్వాదశ సంఖ్యయా॥

తా॥ ఎక్కడైతే బ్రాహ్మణసమారాధన విషయమున బ్రాహ్మణ సంఖ్య తెలుపబడదో అక్కడ విప్రులు పండ్రెండుగురు సమారాధనము చేయదగినవారు.

శ్లో॥ సర్వేషా మేవ మంత్రాణా - మేష ధర్మో విధీయతే॥

తా॥ మంత్రములన్నింటికి నిదియే ధర్మముగా విధింపబడు చున్నది.

శ్లో॥ మంత్రాణాం పల్లవో వాసో - మంత్రాణాం ప్రణవః శిరః
శిరః పల్లవ సంయుక్తో - మంత్రం కామప్రదం స్మృతమ్॥

తా॥ మంత్రములకు పల్లవమే ప్రధానమగుననికి, మంత్రములకు ప్రణవమే శిరస్సు. శిరస్సు పల్లవములతో కూడినదైన మంత్రము కామ ప్రదముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏకాక్షరోపదేష్టా పి - గురుః పూజ్యో మ నీషిభిః
అజ్ఞానా దపి లోభా ద్వా - నావమాన్యః కదాచ న॥

తా॥ ఒక్క అక్షరముపదేశించిన వాడైనను గురువే. అట్టివాడు బుద్ధిమంతులచే పూజింపదగినవాడు. ఆ గురువు అజ్ఞానము వలన గాని లోభమువలనగాని ఎప్పుడూ అవమానింపదగిన వాడు కాదు.

శ్లో॥ గురు ముత్సవకాలేషు - పుణ్యకాలేషు వా పునః
యో నజానతి మూఢాత్మా - రౌరవం నరకం వ్రజేత్॥

తా॥ ఉత్సవ కాలమునందు కాని, పుణ్య కాలమునందుకాని గురువు నెవడు మరచిపోవునో అట్టి మూఢుడు రౌరవ నరకము ననుభవించును.

శ్లో॥ యః ప్రతిశ్రుత్య గురవే న ప్రయచ్ఛతి కించన
 భ్రమేత్ సోయం ప్రతిగృహం భిక్షార్థీ చ పిశాచవత్॥

తా॥ ఎవడైతే గురువున కిత్తునని ప్రతిజ్ఞ చేసి ఏ మాత్రమీయడో అట్టివాడు బిక్షార్థివలె పిశాచము వలె ప్రతి యింటికి తిరుగుచుండును.

శ్లో॥ అతిక్రామతి గుర్వాజ్ఞాం - యో గురుం ప్రతిభాషతే
స బ్రహ్మరాక్షసో ఽరణ్యే - శిష్యవ్యాజానుగో నరః॥

తా॥ శిష్యుడుగా దగ్గరచేరి ఎవడు గుర్వాజ్ఞను మీఱునో, ఎవడు గురువునకు ఎదురు చెప్పునో వాడు అరణ్యమున బ్రహ్మరాక్షసుడై నరుగువాడగును.

శ్లో॥ సంపూజయే ద్గురుం భక్త్యా విత్తశాఠ్య వివర్జితః
అన్యథా జన్మసాహస్రే - దరిద్రో భవతి ధ్రువమ్॥

తా॥ ధనలోభమును వీడి గురువును భక్తితో పూజింపవలెను. అట్లుకాకున్న వేయి జన్మలందు నిశ్చయముగా దరిద్రుడగును.

శ్లో॥ గురు శ్చ గురుపత్నీ చ గురుభ్రాతా గురో స్సుతః
చత్వార ఏతే సంపూజ్యాః - గురుబుద్ధ్యా విచక్షణైః॥

తా॥ గురువు, గురువుగారి భార్య, గురువుగారి సోదరుడు, గురుపుత్రుడు అనునీ నల్గురను జ్ఞానవంతుడగువాడు గురుభావనతోనే పూజింపనగును.

శ్లో॥ గురుం ప్రకాశయే ద్ధీమాన్ - మంత్ర యత్నేన గోపయేత్
తత్ప్రకారో హి సర్వత్ర - సభాసు గుణకీర్తనః॥

తా॥ బుద్ధిమంతుడగువాడు గురుదేవుని తెలుపుకొనుచు కీర్తించదగును. మంత్రమును మాత్రము వెలువరించక రహస్యముగా నుంచుకొనవలెను. ఆ రీతిగానే అంతట సభలందు గుణకీర్తనుడగును.

శ్లో॥ అప్రకాశో హి మంత్రస్య - సదా హృది నివేశనం
తత్త్వా దనన్యచిత్తస్సన్ - భవే ద్గురుపరాయణః॥

తా॥ ప్రకాశింపజేయదగని మంత్రమును హృదయము నందుంచుకొనదగును. తాత్త్వికముగ వేరొక మనసునలేనివాడై గురుపరాయణుడై యుండదగును.

శ్రీగురుస్తవం -

శ్లో॥ గురవో నిర్మలా శ్శాంతాః - సాధకా మితభాషిణః
ఏతైః కారుణ్యతో దత్తో - మంత్రః క్షిప్రం ప్రసీదతి॥

తా॥ గురువులనగా నిర్మలమగువారు, శాంతస్థితికలవారు, సాధకులగువారు, మిత భాషులగువారున్ను అట్టివారిచే దయతో నీయబడిన మంత్రము వెంటనే అనుగ్రహించగలదు.

శ్లో॥ నిత్యాయ నిర్వికల్పాయ - నిరవద్యాయ యోగినే
నిర్మలాయ గిరీశాయ - శివాయ గురవే నమః॥

తా॥ నిత్యుడు, వికల్పమునది లేనివాడు, ఆక్షేపణ లేనివాడు, చిత్తవృత్తుల నిరోధించినవాడు, నిర్మలుడు, బృహస్పతిసముడు, మంగళ స్వరూపుడు అగు గురువుకు నమస్కారము.

శ్లో॥ య త్కటాక్ష మహామేరు - మహ మాశ్రిత్య నిత్యశః
సుభగోఽస్మి కృతార్థో ఽస్మి - తమేవ గురు మాశ్రయే॥

తా॥ ఏవాని అనుగ్రహము చూపులను మహామేరు పర్వతము ఎల్లప్పుడు నాశ్రయించి అదృష్టవంతుడనైతినో కృత కృత్యుడైతినో అట్టి గురువు నాశ్రయించుచున్నాను.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య - జ్ఞానాం జన శలాకయా
చక్షు రున్మీలితం యేన - తస్మై శ్రీ గురవే నమః॥

తా॥ అజ్ఞానము అను తిమిరవ్యాధిచే గ్రుడ్డివాడైన వానికి జ్ఞానము అను శలాకవలన ఎవనిచే కండ్లు తెరివిడి చేయబడెనో అట్టి శ్రీ గురుదేవునకు నమస్కారము.

శ్లో॥ అనవచ్ఛిన్న సద్రూప - చిదానందాత్మన స్తవ
నమస్కార తిరస్కారే - కథం దేవ! కరో మ్యహం॥

తా॥ వెడగొట్టబడని సత్యరూపము కల్గి జ్ఞానమయుడు ఆనందమయుడునగు నీకు ఓ గురుదేవా! నమస్కారము కాని తిరస్కారము కాని ఎట్లు చేయగలను?

శ్లో॥ భావాభావ విహీనాయ - స్వభువే భోగరూపిణే
స్వస్వరూప ప్రకాశాయ - శివాయ గురవే నమః॥

తా॥ భావము కాని అభావము కాని లేనివాడు, తనకు తానే కారణమైనవాడు అనుభవ రూపమైన వాడు, స్వస్వరూప ప్రకాశము కలవాడు మంగళమూర్తియగు గురువుకు నమస్కారము.

శ్లో॥ గురుశుశ్రూషయా విద్యా - పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యా - చతుర్థం నోపలభ్యతే॥

తా॥ విద్య గురువునకు సేవ చేసి పొందదగినది, లేదా పుష్కలముగా గురు దక్షిణ సమర్పించి పొందదగినది, అదియును కాకున్న ఒక విద్య నిచ్చి వేరొక విద్యను స్వీకరించునది తప్ప విద్య నేర్చుటకు నాల్గవ పద్ధతి లేదు.

శ్లో॥ సహస్ర భుజమండలే - దశశతాయుదే షణ్ముఖే
సహస్ర హయముగ్రథే - సకలలోక సంరక్షణే
సహస్ర వనితాయుతే విహరతి స్మరే వా జలే
హనూమతి మనో మమ ప్రవిశతాం సుఖప్రాప్తయే॥

తా॥ వేయి బుజముల సమూహము కల్గినట్టి, వేయి ఆయుధములు కలయట్టి, ఆరు ముఖములు కల్గినట్టి, సకల లోకముల రక్షించునట్టి, వేయి మంది వనితల యందు విహరించు మన్మధుని వలె పంపా జలమున విహరించువాడు అగు హనుమంతుని యెడ నా మనస్సు సుఖ ప్రాప్తి కొఱకై ప్రవేశించుగాక।

శ్లో॥ వామాంక న్యస్త వామః కరధృత కమలాయా స్తథా వామబాహూ
న్యస్తారక్తోత్పలాయా స్తన విధృత లస ద్వామబాహుః ప్రియాయాః
రమ్యా కల్పాభిరామో ధృత పరశు మృగాసి ద్రుమః కాంచనాభో
భూయా త్పద్మాసనస్థః తరణిశతతనుః సంపదే హ్యాంజనేయః

తా॥ ఎడమ తొడయందు సువర్చలను కల్గియున్నవాడు, చేతియందు కమలము ధరించిన, ఎడమ చేతియందు ఎఱ్ఱనైన కలువను ధరించిన ప్రియురాలి యొక్క స్తనములకడ ప్రకాశించు ఎడమచేయి కలవాడు రమ్యములగు ఆభరణములతో ప్రకాశించువాడు గొడ్డలి, లేడి, కత్తి, చెట్టులను ధరించి బంగరు కాంతితో నొప్పువాడు, పద్మాసనమున కూర్చొని నూరు సూర్యులతో సమానమైన దేహముకల ఆంజనేయుడు సంపదలను కలగజేయుగాక।

శ్లో॥ ఏవం కృత్వాంగషట్కం కపికులతిలకం రామదూతం మహాంతం
ధ్యాయే ద్రేవాజలస్థం యువతిభి రభితః క్రీడమానం మహాంతం
రోగాంధ్యా దీప్తరూపం ప్రముదిత మనసం లోల రక్తాయతాక్షం
హస్తాబ్జై ర్వారయ స్తం భృగు పరి వితతై రుద్యమానం పయోదాన్॥

తా॥ ఇట్లు అంగ న్యాసకరన్యా సాదులనొనర్చి వానర శ్రేష్ఠుడును, రామునిదూతయు, రేవానదీ జలముల విహరించువాడును రోగములనెడు చీకటుల తొలగించుటలో ప్రకాశమానమైన రూపము కలవాడును, సంతస మునను మనస్సు కలవాడును, ఎఱ్ఱనై కదలుచున్న నేత్రములు కల

వాడును, ఎత్తున వెడలు మేఘములను తన చేతులతో వారించుచున్న వాడును అగు హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ అంజనేయో మహాత్మా కనకమణిగణాలంకృతాంగ స్సజాయః
ఆసీనో మంత్రిమధ్యే రవిరుచి విలస ద్రత్నపీఠే ప్రసన్నః
ధ్యాయే త్తైస్స్వ ర్బాహుదండై ర్ధృత శరనికరై శ్చాప వర్మా సి పాశ
ప్రాసాద్యై స్సర్వసిద్ధ్యై గుఃదురిత మహాచోరవృత్త్యై చలక్ష్యం॥

తా॥ శ్రీఆంజనేయుడు, మహాత్ముడు, బంగారము, మణుల సమూహములతో అలంకరింపబడినవాడు, భార్యతో కూడియున్నవాడు, మంత్రి మండలి మధ్యయందు సూర్యకాంతితో ప్రకాశమానమైన రత్నమయ పీఠమునం దాసీనుడై యున్నవాడు, ప్రసన్న రూపుడును, అట్టివానిని, తన బాహువులతో ధరింపబడిన బాణములతోడి ధనుస్సును, తనకు కవచమును, పాశ ప్రాసాది, ఆయుధములు కలవానిని, మిక్కిలి పాపకారులగు చోరుల నివృత్తి లక్ష్యముగా గలవాడునగు హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ దశశత హయయుత రథవరనిలయం త్రైలోక్య భీషణం ధ్యాయేత్
మధ్యాహ్నార్క సమానం గర్జనం తర్జయన్తం అసురగణాన్॥

తా॥ వేయిగుఱ్ఱములు పూన్చిన రథశ్రేష్ఠము నధిరోహించినవాడు, ముల్లోకములకు భయంకరుడు, మధ్యందిన సూర్యసమానుడు, రాక్షస గణములను బెదరించుచు భయపెట్టువాడు నగు హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ దోర్దండమండలై రాయుధమండలం ఉత్క్షిపన్త మాశుభదం
మణికుండల యుత గండం ఖండిత సర్వారి మండలం మన్యే॥

తా॥ బాహుదండములతో ఆయుధసమూహము నెత్తియుంచువాడు, కడదాక శుభముల నిచ్చువాడు, మణిమయ కుండలములు చెక్కిలి

భాగమున ప్రేలాడువాడు, సమస్త శత్రుసమూహములను నాశనమొనర్చిన వాడు నగు హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ నానాయుధ నికర ధరైః పదాతిభి ర్వేష్టితః
తథా రథిభి రభితో గజయూథయుతైః॥

తా॥ అనేక విధముల ఆయుధములు ధరించిన పదాతిదళముతో చుట్టబడినవాడు, అట్లే గజ సమూహముకల రథులముందు గలవాడు అగు హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ యథా రామేణ సందిష్టో - హనూమాన్ ప్రత్యగా త్తదా
లంకాదహన వేళాయాం - షణ్ముఖో భూ త్తదా హరిః॥

తా॥ రాముడాదేశించిన రీతిగా హనుమంతుడు లంక కేగినవాడై లంకాదహన వేళయం దతడు షణ్ముఖుడాయెను.

శ్లో॥ వల్లరీ భార్యయా యుక్తః - కృత హేతి పురస్సరః
హనుమాన్ ప్రతిజానీతే - నామ్నా వై ప్రీతి శక్తిమాన్॥

తా॥ తీగెవలె కోమలయగు భార్యతో కూడినవాడు ఖడ్గముకల వాడునై ఆ హనుమంతుడు ప్రీతిని, శక్తిని కల్గియున్నవాడుగనున్నాడు.

శ్లో॥ షణ్ముఖం చ హనూమంతం - హేమరంభా వనాశ్రయం
సహస్ర బాహు మత్యుగ్రం - హనూమంత ముపాస్మహే॥

తా॥ ఆరుముఖములు కలవాడును, హనుమంతుడైన వాడును, బంగరు అరటితోటలు ఆశ్రయముగా కలవాడును, వేయి బాహువులు కల వాడును, మిక్కిలి ఉగ్రమైనవాడును అగు హనుమంతు నుపాసించు చున్నాను.

శ్లో॥ కర్కటీ లోకసంహర్త్రి - విషూచీ లోకఘాతినీ
చత్వారి నామా న్యేతాని - లంఖినీ భగినీ స్త్రియః॥

తా॥ కర్కాటి లోకసంహార మొనర్చునది. విషూచియు లోకముల నాశన మొనర్చునది. లంఖిణి, పటియు, భగిని యను నామముల నాలుగు రాక్షసస్త్రీల నామములు.

శ్లో॥ కర్కాటీవధ వేళాయాం - హనూమా న్వాయునందనః
ధృత్వా భుజసహస్రం వై - షణ్ముఖాని భయంకరః॥

తా॥ కర్కాటీ వధ సమయమున వాయునందనుడగు హనుమంతుడు వేయి భుజములు ధరించి, ఆరుముఖములు కలవాడై భయంకరుడై యుండెను.

శ్లో॥ సౌమిత్రి ప్రాణదాతా కపట ముని వపుః కాలనేమి ప్రహర్తా
దర్పోద్రేక ప్రగల్భః ప్రకటిత మకరీ దంత భగ్నో ప్రవాలః
హేలా జంఘాల వాలా ద్భుత పద మహిమా లంఘితాబ్ధి ప్రతాపః
శౌర్యశ్రీ రమ్యగాత్రః కలుషపరిహరః పాతు మాం శ్రీ హనూమాన్॥

తా॥ లక్ష్మణునకు ప్రాణము లిచ్చినవాడు, కపటమునివేషము ధరించిన కాలనేమిని సంహరించినవాడు, తీవి ఉద్రేకలముతో దిట్టయైన వాడు. మకరి దంతముల భగ్నమొనర్చిన గొప్ప తోకకలవాడు, విలాసము గనే గొప్ప వేగము పోగల పాదములతో సముద్రమును దాటిన ప్రతాపశాలి, శౌర్యశోభతో రమ్యమైన దేహముకలవాడు, పాపముల తొలగించువాడు నగు శ్రీహనుమంతుడు నన్ను రక్షించుగాక.

శ్లో॥ ఇమం స్తోత్రంపఠన్ విద్వాన్ - భుక్తిం ముక్తించ విందతి
స ఏవ పురుషశ్రేష్ఠః - యోగ్య స్సర్వకర్మసు॥

తా॥ ఈ స్తోత్రమును పఠించు విజ్ఞుడు భుక్తిని, ముక్తిని పొంద గలడు. అట్టివాడే పురుషులలో శ్రేష్ఠుడు. అతడే సర్వ కర్మలందు యోగ్యుడు.

శ్లో॥ సమస్త స్తోత్ర జాలేషు - స్తోత్రాణా ముత్తమోత్తమం
ఏకవారం ద్వివారం వా - త్రివారం వా పఠే న్నరః
సర్వాపద్భ్యో నివృత్తస్సన్ — హనూమత్పద మాప్నుయాత్॥

తా। సమస్తస్తోత్రములందు ఇది ఉత్తమోత్తమమైనది. ఒకమారు కాని రెండుమార్లుకాని, మూడుసార్లుకాని దీనిని పఠించిన మనుష్యుడు ఆపద. లన్నింటినుండి విముక్తుడై హనుమంతుని పాదముల చెంతకు జేరును

ఇతి శ్రీపరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
నవఖండ హనుమన్మంత్ర ప్రభావ కథనం నామ ఏకసప్తతిః పటలః

ద్విసప్తతిః పటలః

## స్తోత్రప్రకార కథనం

శ్రీ పరాశరః-

శ్లో॥ స్తోత్రాంతరం ప్రవక్ష్యామి - సర్వమంత్రమయం మునేః
పార్వతీశ్వర సంవాదం - స్తోత్రాణా ముత్తమోత్తమమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయ మహామునీ! సర్వమంత్ర మయమగు వేరొక స్తోత్రమును చెప్పుచున్నాను. ఈ పార్వతీశ్వర సంవాద స్తోత్రము స్తోత్రములన్నిట ఉత్తమోత్తమమైనది.

త్ర్యక్షరీ-

శ్లో॥ ఆదౌ 'హ'కార ముచ్చార్య - నుకారం తదనంతరం
మాకార ముచ్చరే ద్ధీమాన్ - నకారం చాస్వరం తతః

తా॥ ముందు హకారము నుచ్చరించి అనంతరము 'ను' కారము చెప్పవలెను. బుద్ధిశాలియగువాడు అనంతరము 'మా' కారము చెప్పి స్వరరహితమైన అనగా అచ్చులేని నకారమును 'న్' అను దానిని పిమ్మట చెప్పవలెను.

పంచాక్షరీ :-

శ్లో॥ త్రివర్ణోయం మను రిహ బాలాయా మనుపల్లవః
స్ఫ్రేం హూం క్షూం హౌం సముచ్చార్య - హ్యేష
పంచాక్షరో మనుః॥

తా॥ ఈ చెప్పినది మూడక్షరముల మంత్రము. ప్రణవముతో స్ఫ్రేం హ్రూం, క్షూం, హ్రౌంలలో ననుపల్లవమును చెప్పుటద్వారా అది పంచాక్షరి యగును.

షడక్షరీ :-

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - శక్తిబీజ మనంతరం
కపయేతి పదం చోక్త్వా - వహ్ని జాయాం సముచ్చరేత్
తారాది ముచ్చరే త్తత్ర - షడక్షర ముదీరితమ్॥

తా॥ మొదట ఓంకారమునుచ్చరించి అనంతరము 'లం' అను శక్తిబీజముంచి 'కపయే' అను పదము పల్కి 'స్వాహా' యని చెప్ప వలెను. అచ్చట తరింపజేయు శక్తిగల ప్రణవము ఆదియం దుచ్చరించ వలెను. అది షడక్షరిగా చెప్పబడుచున్నది.

సప్తాక్షరీ :-

శ్లో॥ వేదాది వహ్నిజాయాంతం - రామదూతాయ చోచ్చరేత్
సప్తాక్షర మిమం మంత్రం - మంత్రాణా ముత్తమోత్తమమ్

తా॥ ఓంకారముచెప్పి రామదూతాయ అని ఉచ్చరించి స్వాహా యనవలెను. ఇది సప్తాక్షరీ మంత్రము. మంత్రములన్నిట శ్రేష్ఠమైనది

అష్టాక్షరీ :-

శ్లో॥ ఆదౌ తారం సముచ్చార్య - హనుమ ద్బీజ ముచ్చరేత్
ఆంజనేయాయ శబ్దం చ నమశ్శబ్దం తతో చ్చరేత్॥
అయ మష్టాక్షరో మంత్ర - సర్వోత్కృష్టో జగత్త్రయే॥

తా॥ ఓంకారము పల్కిన పిదప హ్రౌం బీజము చెప్పి ఆంజ నేయాయ అనిన తరువాత నమః శబ్దము నుచ్చరింపవలెను. ముల్లోకము లందు గొప్పదైన ఈ మంత్రము అష్టాక్షర మంత్రము.

దశాక్షరీ:-

శ్లో॥ ఆదౌ శ్రీబీజ ముచ్చార్య - మాయా బీజ మనంతరం
వాయునందనాయేతి తథా - స్వాహాంతం ప్రజపే త్సుధీః
దశాక్షర మిదం మంత్రం - మంత్రాణా ముత్తమోత్తమమ్॥

తా॥ మొదట శ్రీబీజము నుచ్చరించి అనంతరము ఇం అను మాయా బీజము చెప్పి 'వాయునందనాయ' అని 'స్వాహా' అనునది పిదప పల్కి పండితుడగువాడు జపించవలెను. మంత్రములలో శ్రేష్ఠమైన ఇది దశాక్షర మంత్రము.

ద్వాదశాక్షరీ -

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - హరిమర్కట శబ్దతః
మర్కటాయ పదం పశ్చాత్ - స్వాహాంతం ప్రజపే త్సుధీః
ద్వాదశాక్షర మంత్రోఽయం - మునిభిః పరికీర్తితః॥

తా॥ మొదట ఓం కారము నుచ్చరించి 'హరిమర్కట' శబ్దముపై 'మర్కటాయ' పదము చెప్పిన పిదప స్వాహాయని జపించవలెను. ఈ మంత్రము ద్వాదశాక్షర మంత్రముగా మునులచే కీర్తింపబడినది.

త్రయోదశాక్షరీ:-

శ్లో॥ ఏకాక్షరం హనూమతః - ప్రథమం తు సముచ్చరేత్
హనూమతే పదం తత్ర - రామభక్తాయ సంవదేత్॥

తా॥ మొదట హ్రౌం అను బీజమును పల్కి హనుమతే అను పదమును చెప్పిన అనంతరము రామభక్తాయ అని చెప్పవలెను. స్వాహాంతము చేయవలెను.

శ్లో॥ సంపత్పల్లవ సంయుక్తం - పూర్వం ప్రణవ ముచ్చరేత్
త్రయోదశాక్షరీ విద్యా - మహామను రితి స్మృతా॥

తా॥ అంతకు పూర్వముననే ఓం అని ప్రణవమును శ్రీం అని బీజమును చెప్పవలెను. ఇది త్రయోదశాక్షరీ విద్యయగును. దీనిని మహా మంత్రముగా తెలియదగును.

శ్లో॥ అష్టసంఖ్యా ఇమే మంత్రాః స్తోత్రమధ్యే ప్రకీర్తితాః
శంభునా చోపదిష్టా శ్చ - పార్వత్యై హితకామ్యయా॥

తా॥ ఈ ఎనిమిది మంత్రములు లోకహితము కోరి పార్వతికి పరమేశ్వరునిచే ఉపదేశింపబడినవి. స్తోత్ర మధ్యమునందు కీర్తింపబడు చున్నవి.

శ్లో॥ సర్వేషా మేవ మంత్రాణాం - ఋషి రీశ్వర ఉచ్యతే
హనుమా న్దేవతా ప్రోక్తా - ఛందో గాయత్రి రుచ్యతే॥

తా॥ పై మంత్రము లన్నిటికి ఈశ్వరుడు ఋషి. హనుమాన్ దేవతగా చెప్పబడుచున్నాడు. గాయత్రి ఛంధస్సుగా చెప్పబడినది.

శ్లో॥ న్యాసం కృత్వా ప్రయత్నేన - మూలమంత్ర విధానతః
మంత్రస్య దేవతాధ్యానం - ప్రత్యేకం తు పృథక్ పృథక్॥
సర్వేషా మేవ మంత్రాణా మేకః పరిష్కార ఇష్యతే॥

తా। అంగన్యాసకరన్యాసాదు లొనర్చుట మూలమంత్ర విధానముతో చేసి ఆ మంత్రమునకు దేవతా ధ్యానమును ప్రత్యేకముగా వేరు వేరుగా చేయవలెను. అన్ని మంత్రములకు పరిష్కార మొక్కటియే తెలియబడుచున్నది.

ఈశ్వరః-

శ్లో॥ శృణు దేవి! ప్రవక్ష్యామి - స్తోత్రం సర్వ శుభావహం
సర్వకామప్రదం నృణాం - హనుమత్స్తోత్ర ముత్తమమ్॥

తా॥ ఈశ్వరుడు చెప్పుచున్నాడు. ఓ పార్వతీదేవీ! సర్వశుభములకు నిలయమగు స్తోత్రము చెప్పుచున్నాను వినుము. ఇది నరులకు అన్ని కోరికలు తీర్చగల శ్రేష్ఠమైన హనుమత్స్తోత్రము.

శ్లో॥ తప్త హాటక సంకాశం - నానాపుష్ప విభూషితం
ఉద్య ద్బాలార్క వదనం - త్రినేత్రం కుండలోజ్జ్వలమ్॥

తా॥ పుటము పెట్టిన బంగారమువంటి కాంతి కలవాడును, అనేక విధములగు పూవులలంకరించిన వాడును, ఉదయించు బాల సూర్యుని వంటి ముఖము కలవాడును, మూడు నేత్రములు కలవాడును, కుండలములతో ప్రకాశించునట్టివాడును,

శ్లో॥ మౌంజీ కౌపీన సంయుక్తం హేమ యజ్ఞోపవీతినం
పింగళాక్షం మహాకాయం - టంక శైలేంద్ర ధారిణమ్॥

తా॥ ముంజదర్భ మొలత్రాడు, గోచియు కల్గినవాడును, బంగరు జందెము కలవాడును, పింగళ వర్ణము గల నేత్రములు కలవాడును, గొప్ప దేహము కలవాడును, టంకాయుధమును, పర్వతమును ధరించిన వాడును.

శ్లో॥ శిఖా నిక్షిప్త వాలాగ్రం - మేరు శైలాగ్ర సంస్థితం
మూర్తిత్రయాత్మకం వీరం - మహాశౌర్యం మహాహనుమ్॥

తా॥ తల పై నుంచబడినతోక చివటిభాగము కలవాడు, మేరుపర్వతము పైనున్నవాడును, బ్రహ్మ విష్ణు మహేశ్వరస్వరూపుడును, వీరుడును, గొప్ప పరాక్రమముకలవాడును, గొప్ప దవుడకలవాడును.

శ్లో॥ హనూమంతం వాయుసుతం - నమామి బ్రహ్మచారిణం॥

తా॥ హనుమంతుడు వాయుసుతుడు, బ్రహ్మచారియు నగువానికి నమస్కారము.

శ్లో॥ త్రివర్ణాక్షర మంత్రస్థం - జపాకుసుమ సన్నిభం
నానా భూషణ సంయుక్తం - అంజనేయం నమా మ్యహమ్॥

తా॥ మూడువర్ణములుకల మంత్రమున నుండువాడును, దాసాని పువ్వువలె ప్రకాశించువాడును, అనేక విధములగు ఆభరణములతో కూడిన వాడును అగు అంజనేయుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ పంచాక్షరస్థితం దేవం - నీల నీరద సన్నిభం
పూజితం సర్వదేవైస్తు - రాక్షసారిం నమా మ్యహమ్॥

తా। నల్లని మేఘముతో సమానమైనవానిని, దేవతలందరిచే పూజింపబడువానిని, రాక్షసులకు శత్రువైనవానిని, పంచాక్షర మంత్రము నందునున్న హనుమంతునిగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ అచలద్యుతి సంకాశం - సర్వాలంకార భూషితం
షడక్షర స్థితం దేవం - నమామి బ్రహ్మచారిణమ్।

తా। పర్వతముయొక్క కాంతితో సమానమైన కాంతికలవాడును, సమస్తములగు ఆభణరములతో ప్రకాశించువాడును, బ్రహ్మచారియు, షడక్షర మంత్రము నందునున్న దేవునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ సప్తవర్ణమయం దేవం - హరిద్రాభం సురార్చితం
సుందరాస్యాబ్జ సహితం - త్రినేత్రం తం నమా మ్యహమ్॥

తా। పసుపుతో సమానమైన దేహకాంతికలవాడును, దేవతలచే అర్చింపబడువాడును, సుందరమైన ముఖ పద్మముకలవాడును, మూడు కన్నులుకలవాడును, సప్తవర్ణ మంత్రమున నుండువాడునగు హనుమంతునకు నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ అష్టాక్షరాధిపం దేవం - క్షీరవర్ణ మహాహనుం
నమామి జగతాం వంద్యం - లంకాప్రాకార దాహకమ్॥

తా. పాలవంటి కాంతికలవాడును, పెద్ద దవుడకలవాడును, లోకముల కారాధ్యుడును, లంకను తగులబెట్టినవాడును, అష్టాక్షర మంత్రమున కధినాయకుడైన దేవుడగు హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ అతసీపుష్ప సంకాశం - దశవర్ణాత్మకం విభుం
జటాధరం చతుర్బాహుం - నమామి కపినాయకమ్॥

తా॥ అగిసె పూవు వంటి కాంతి కలవాడును, జడలు ధరించిన వాడును, నాల్గుచేతులు కలవాడును, వానరనాయకుడును, సర్వ సమర్థుడును దశ వర్ణాత్మకమగు మంత్రమున కధి దేవతయగు హనుమంతునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ద్వాదశాక్షర మంత్రస్య - నాయకం కుంతధారిణం
అంకుశం చ దధానం తం - కపివర్యం నమా మ్యహమ్॥

తా॥ ఈటెను ధరించినవాడు, అంకుశము ధరించినవాడు, ద్వాదశాక్షర మంత్రమున కధిపతియైన వానరనాయకునకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ త్రయోదశాక్షర యుతం - సీతాదుఃఖ నివారణం
హేమవర్ణం లసత్కాయం - భజే సుగ్రీవ మంత్రిణమ్॥

తా॥ సీతాదేవి దుఃఖమును పోగొట్టినవాడును, బంగారు చాయతో ప్రకాశించువాడును, సుగ్రీవునకు మంత్రియైన వాడును త్రయోదాశాక్షర మంత్రమున కధిపతియునగు హనుమంతుని సేవింతును.

శ్లో॥ మాలామంత్రాత్మకం దేవం - చిత్రవర్ణం చతుర్భుజం
పాశాంకుశాఽ భయకరం - ధృత టంకం నమా మ్యహమ్॥

తా॥ చిత్రవర్ణము కలవాడును, నాల్గుభుజములు కలవాడును, పాశము, అంకుశము ధరించిన అభయ ప్రదాతయు, టంకాయుధమును ధరించినవాడును, మూలమంత్రమున కధి దేవతయగు హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ సురాసురగణై స్సర్వైః సంస్తుతం ప్రణమా మ్యహమ్

తా॥ దేవ దానవ సమూహమంతటిచే స్తోత్రము చేయబడు హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఏవం ధ్యాయ న్నరో నిత్యం - సర్వపాపైః ప్రముచ్యతే
ప్రయాణే చింతిత స్సిద్ధిః — శీఘ్రమేవ న సంశయః॥

తా॥ ఈ రీతిగా ధ్యానము చేయు మనుష్యుని పాపములన్నియు తొలగును. ప్రయాణమున ఈ స్తోత్రము పఠించినచో వెంటనే కోరిన కొర్కె సఫలమగును. ఇందు సందియము లేదు.



శ్లో॥ అష్టమ్యాం తు చతుర్దశ్యాం - అర్కవారే విశేషతః
సంధ్యా పూజాం ప్రకుర్వీత - ద్వాదశ్యాం తు విశేషతః

తా॥ అష్టమినాడు కాని, చతుర్దశి తిథియందు కాని, విశేషించి ఆదివారమునకాని, ద్వాదశియందుకాని సంధ్యా సమయమున పూజనొనర్చవలెను.



శ్లో॥ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః
పూజయే త్తత్ర విద్వాంసో - రక్తవస్త్రేణ వేష్టయేత్॥

తా॥ విజ్ఞుడగువాడు జిల్లేడు వేరుతో హనుమ ద్విగ్రహమును తయారుచేయవలెను. దానికి ఎఱ్ఱని వస్త్రము చుట్టి పూజింపవలెను.

శ్లో॥ బ్రాహ్మణా న్భోజయే త్పశ్చాత్ - తత్ప్రీత్యై పర్వపర్వసు
యః కరోతి దృఢం భక్త్యా - పూజాం హనుమతో నరః॥

తా॥ అనంతరము ప్రతి పర్వదినమునందును హనుమంతుని ప్రీతి కొఱకై విప్రులకు సమారాధన మొనర్చవలెను. ఇట్లు ఏ మనుష్యుడు నిశ్చలమగు భక్తితో హనుమత్పూజను చేయుదురో



శ్లో॥ న శస్త్రభయ మాప్నోతి - భయం వా ప్యంతరిక్షజమ్॥

తా॥ వారు ఏ ఆయుధము వలనను భయమందరు. అంతరిక్ష సంబంధమగు భయము లేవియు వారికి ఉండవు.

శ్లో॥ అక్షాది రాక్షసహారం దశకంఠదర్ప నిర్మూలనం
రఘువరాంఘ్రిసరోజ భక్తం
సీతావిషయ ఘనదుఃఖ మహాంధకార
నిర్వాపణే శిశిర భాను మహం నమామి॥

తా॥ అక్షరాక్షసాదులను సంహరించినవాడు, రావణుని గర్వము నణచినవాడు, శ్రీరామ చంద్రుని పాదపద్మములకు భక్తుడు, జానకీదేవి యొక్క గొప్ప దుఃఖమును మహాంధకారమును పోగొట్టుటకు శిశిర ఋతువునందలి సూర్యుని వంటి వాడునగు హనుమంతునకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ మాం పశ్య పశ్య దయయా నిజదృష్టిపాతైః
మాం రక్ష రక్ష పరితో రిపు దుఃఖపుంజాత్
వశ్యం కురు త్రిజగతాం మనుజేశ్వరాణాం
మే దేహి దేహి మహతీం వసుధాం శ్రియం చ॥

తా॥ ఓ హనుమంతా! నీ దృష్టి నాపై ప్రసరింపజేసి నన్ను దయతో చూడుము. నా చుట్టునున్న శత్రువుల వలన దుఃఖ సమూహము నుండి నన్ను రక్షింపుము. నాకు ముల్లోకములందలి రాజులను వశ్యమగునట్లు చేయుము. నాకు గొప్పదగు భూమిని, సంపదను ప్రసాదింపుము.

శ్లో॥ ఆపద్భ్యో రక్ష సర్వత్ర - ఆంజనేయ నమోఽస్తు తే
బంధనం ఛేదయాశు త్వం - కపివర్య నమోఽస్తు తే॥

తా॥ ఓ ఆంజనేయా! నన్ను ఆపదల నుండి అంతట రక్షింపుము నీకు నమస్కారము. శీఘ్రముగా నా బంధముల నన్నిటిని ఛేదింపుము. కపివానర శ్రేష్ఠా! నీకు నమస్కారము.

శ్లో॥ ఉచ్చాటయ రిపూన్ సర్వాన్ - మోహనం భూభుజాం కురు
విద్వేషిణో మారయ త్వం - త్రిమూర్త్యాత్మక సర్వదా॥

తా॥ ఓ త్రిమూర్తి స్వరూపా నీవెల్లప్పుడును శత్రువులనందఱను వశమగునట్లు చేయుము. విద్వేషుల నందఱను సంహరింపుము.

శ్లో॥ దేహి మే సంపదం నిత్యం - త్రిలోచన నమోఽస్తు తే
దుష్టరోగాన్ జహి జహి - రామదూత నమోఽస్తు తే

తా॥ ఓ త్రిలోచనుడా! నీకు నమస్కారము. నిత్యము నాకు సంపదనిమ్ము. ఓ రామదూతా! నీకు నమస్కారము. చెడు రోగముల నన్నిటిని పోగొట్టుము.

శ్లో॥ సంజీవ పర్వతోద్ధార - మమ దుఃఖం నివారయ
జ్వరా నుపద్రవాం త్సర్వాన్ - నాశయ త్వం సురాంతక!

తా॥ ఓ సంజీవ పర్వతము నుద్ధరించినవాడా! నా దుఃఖమును పోగొట్టుము. ఓ రాక్షసాంతకా! జ్వరములను, సర్వ ఉపద్రవములను అణచుము.

శ్లో॥ ఏవం స్తుత్వా హనూమంతం - నరః శ్రద్ధా సమన్వితః
పుత్ర పౌత్రాది సహితః - సర్వసౌఖ్య మవాప్నుయాత్॥

తా॥ ఈ రీతిగా మనుజుడు శ్రద్ధతో హనుమంతుని స్తోత్రము చేసిన పుత్ర పౌత్రాదులతో కూడి సర్వ సౌఖ్యములను పొందును.

శ్లో॥ హాహాకార ముఖాంత నిర్య దనలజ్వాలా సమూహో జ్జ్వలం
విద్యుత్ఖండ సుజాత ధూమ్రవపురుషం స్వాట్టహాసం విభుం
సంచూర్ణీకృత ధూమ్రలోచన ముఖా ద్యక్షీణ రక్షోబలం
తం వంద్యాత్సర చారణాసుర వర్తై ర్వంద్యం సమీరాత్మజమ్॥

తా॥ హాహాకారముల వలన నోటి చివఱ నుండి వెలువడెడు అగ్ని జ్వాలల సమూహముతో ప్రకాశించువాడును, మెఱపు ఖండమునుండి పుట్టిన ధూమవర్ణపు దేహము కలవాడు గొప్పదగు అట్ట హాసము కలవాడు, సమర్థుడు, తీక్ష్ణమైన చూపులతోనే ధూమ్రలోచనాది అశేష రాక్షసులను

చూర్ణమొనర్చినవాడు, దేవదానవ చారణాదులందఱకు పూజనీయుడగు వాయుకుమారుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ రఘుపతి పదభక్తం కించి దుత్తంగమాంగం
ముకుళిత కరపద్మం మోదమానాంతరంగం
పులకిత విపులాంగం పుణ్యలీలానుషంగం
వనచర కులనాథం వాయుపుత్రం నమామి॥

తా॥ శ్రీరామచంద్రుని పాదసేవకుని, పొడవైన దేహము కలవానిని, చేతులు జోడించిన వానిని, సంతుష్ట హృదయుని, పులకించిన గొప్ప దేహము కలవానిని పుణ్యలీలతో నిండియున్న వానిని, కపికుల నాథుని, వాయుకుమారుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్॥

తా॥ ఎక్కడెక్కడ శ్రీరామచంద్రుని కీర్తనము జరుగునో అక్కడల్లా దోయిలొగ్గి శిరసువంచి ఆనంద బాష్పాలతో నిండిన కండ్లు కలవాడై యుండు రాక్షసాంతకుడగు హనుమంతుని నమస్కరింపుడు.

శ్లో॥ దివ్యౌషధి ప్రధానేన - కపికోటిం రరక్ష యః
హనూమంతం జపయతం - నమస్తేఽస్తు మహాత్మనే॥

తా॥ దివ్యమైన ఔషధము నిచ్చుటద్వారా వానరసేననంతను ఎవరు రక్షించిరో: అట్టి మహాత్ముడు జపము చేయువాడు నగు హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ బుద్ధిర్బలం యశో ధైర్యం - నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ - హనుమత్స్మరణా ద్భవేత్॥

తా॥ బుద్ధి, బలము, కీర్తి, ధైర్యము, నిర్భయము, రోగము లేకుండుట, ఏ జాడ్యము లేకుండుట, మాటనేర్పు మొదలగునవి అన్నియు హనుమంతుని స్మరించుట వలన కల్గును.

శ్లో॥ వజ్రాంగం పింగకేశాఢ్యం - స్వర్ణకుండల మండితం
ప్రయుధ్యమానం సంగ్రామే - పారావార పరాక్రమమ్॥

తా॥ వజ్రమువంటి అవయవములు కలవాడు, పింగళవర్ణము కల గొప్పకేశ సంపద కలవాడు, బంగారు కుండలములతో ప్రకాశించువాడు యుద్ధరంగమున యుద్ధమొనర్చువాడు, సముద్రమంతటి పరాక్రమము కలవాడగు హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ యంత్రోద్ధారం ప్రవక్ష్యామి - ధారణాఢ్యం సమానతః
భూర్జే తామ్రే తథా పట్టే - భిత్తౌ వస్త్రే శిలాతలే
పద్మపత్రే ఽథవా లేఖ్యం - రోచనాభాగ కేసరైః॥

తా॥ ఎక్కువగా ధరింపదగిన యంత్రమును నిర్మించు రీతి చెప్పుచున్నాను. భూర్జపత్రమునకాని, రాగిరేకుపై కాని, పట్టమున కాని, గోడపై కాని వస్త్రముపై కాని, శిలా ప్రదేశమునకాని, లేదా పద్మ పత్రముననైనను గోరోజనము కుంకుమ పూవులతో గీయవలయును.

శ్లో॥ వృత్తత్రయం పురా లేఖ్యం - వలయేన సుపుచ్ఛవత్
సాధ్యనామ లిఖే న్మధ్యే - బహి రష్టదళం లిఖేత్॥

తా॥ ముందుగ మూడువృత్తములను తోకచుట్టినట్లు గుండ్రముగా గీయవలెను. దాని మధ్య సాధ్య నామము లిఖించి వెలుపల ఎనిమిది దళములను లిఖింపవలెను.

శ్లో॥ పంచాక్షరై స్సాధ్యనామ - వేష్టయే న్నిబిడం దృఢం
దళే ష్వష్టసు వంలేఖ్యం - హుంకారం షణ్ముఖం తథా॥

తా॥ పంచాక్షరములతో సాధ్యనామమును చక్రాకారముగా చుట్టి వ్రాయవలెను. ఎనిమిది దళములందు హూంకారమును లిఖించి దానిలో షట్కోణమును లిఖించవలెను.

శ్లో॥ బహిస్సంవేష్టయేత్తత్ర - వలయేన దృఢం తథా
తద్బహిశ్చతురశ్రం స్యా - త్కోణాగ్రైశ్చ సువిస్తృతైః॥

తా॥ ఆ షట్కోణమునకు బయట వలయమును దృఢముగా చుట్టవలెను. దానికి వెలుపల బాగుగా కోణాగ్రములు వ్యాపించినట్లు చతురశ్రమును గీయవలెను.

శ్లో॥ తల్లేఖాసు త్రిశూలాని - లేఖయేత్ శోభనాని చ
మూలమంత్రేణ తత్సర్వం - వేష్టయేన్మండలం క్రమైః॥

తా॥ ఆ అంచులయందు త్రిశూలములను చక్కగా గీయవలెను. మండల క్రమములో దాని చుట్టు మూలమంత్రము వ్రాయవలెను.

శ్లో॥ పునర్బహిస్తదేవాపి - త్రిరేఖాభిశ్చ వేష్టయేత్
రేఖాంతే చ త్రివలయం - కారయేదేకకోణకమ్॥

తా॥ మరల దానినే మూడు రేఖలతో చుట్టు గీయవలెను. రేఖాంతమునందు ఒక కోణము కల త్రివలయము గీయవలెను.

శ్లో॥ తన్మధ్యే ష్వంకుశం లేఖ్యం - హౌం బీజం సమాలిఖేత్
వజ్రాష్టకేన సంయోజ్యం - మూలమంత్రం తథాష్టధా॥

తా॥ దాని మధ్యభాగమున అంకుశము లిఖించి హౌం బీజమును లిఖించవలెను. వజ్రాష్టకముతో మూలమంత్రము యోజనమొనర్చవలెను.

శ్లో॥ మర్కటేశ్వరం తద్యంత్రే ప్రాణాహ్వానం చ కారయేత్
షట్ఛతైః త్రిశతైర్వాపి - తద్యంత్ర మభిమంత్రయేత్॥

తా॥ ఆ యంత్రమునందు మర్కటేశ్వరునకు ప్రాణ ప్రతిష్ఠ చేయవలెను. ఆ యంత్రమును ఆరువందల పర్యాయములు కాని మూడు వందల పర్యాయములు కాని అభిమంత్రింపవలెను.

శ్లో॥ మర్కటేశ్వర సంయోగ ప్రాప్య బుద్ధ్యా చ కారయేత్

తా॥ మర్కటేశ్వరుడు ఆ యంత్రమున నున్నట్లు భావించి పూజాదిక మొనర్పవలెను.

శ్లో॥ నిష్కల్మష బ్రహ్మచర్య - వ్రతధారీ జితేంద్రియః
వ్యక్తాననో మహాభాగో - హనుమంతం చ పూజయేత్॥

తా॥ కల్మషరహితుడు, బ్రహ్మచర్య వ్రతదీక్షాపరుడు, జితేంద్రియుడు, సుముఖుడగు మహాత్ముడగువాడు హనుమంతుని పూజింపవలెను.

శ్లో॥ కదళీ మాతులుంగాది - ఫలైః ఖాద్యై ర్మనోహరైః
పుష్పై ర్నానావిధై శ్చైవ హ్యుపచారై స్సమాహితః॥

తా॥ అతడు అరటి, మాదీఫలమున్నగు రుచికరములు మనోహరములైన పండ్లతోను నానావిధోపచారముల ద్రవ్యములతోను కూడి పూజింపవలెను.

శ్లో॥ తతో యంత్రం సుధార్యం స్యాత్ - సర్వబాధా వినాశకృత్
సర్వరక్షాకరం నృణాం - బాలానాం యోషితా మపి॥
పశూనాం చ హయానాం చ - మృగాణాం సర్వజీవినామ్॥

తా॥ అప్పుడా యంత్రము చక్కగా ధరింపదగినదై అన్ని బాధలను పోగొట్టగలదగును. అది మనుష్యులకన్ని విధముల రక్షణ నిచ్చునది. బాలురకు స్త్రీలకును అన్ని విధముల రక్షణ నిచ్చునది యగును. పశువులకు, గుఱ్ఱములకు మృగములకు సర్వ జీవులకును ఈ యంత్రము ధరింపదగినదై సర్వవిధముల రక్షయైనట్టిది.

శ్లో॥ జ్వరాద్రికం స్ఫోటకాది - చోర రోగ భయాపహం

తా॥ జ్వరములను, స్ఫోటకాదులను పోగొట్టునది. దొంగలను, రోగములను సర్వ విధముల భయములను తొలగించునది.

శ్లో॥ రాజద్వారే వనే ఘోరే - సంగ్రామే రిపుసంకటే
శస్త్రపాతే మహాభీతౌ — దివ్యాగ్ని జల సంప్లవే
జనవశ్యే రాజవశ్యే - రిపువశ్యే ద్విష ద్వధే॥

తా॥ రాజద్వారమునందు, ఘోరారణ్యమునందు, శత్రువులచే భయంకరమైన యుద్ధరంగమునందు శస్త్రపాతమునందు గొప్ప భయమేర్పడినప్పుడు దైవిక బాధకాని, అగ్ని బాధకాని, జలోపద్రవమేర్పడినప్పుడు కాని అన్నిట ఇది రక్షకాగలదు. జనులు వశము కావలసినప్పుడు రాజవశ్యమునందు, శత్రువశీకరణమున, శత్రువులను నాశన మొనర్చుటయందు

శ్లో॥ దధతా మనిశం యంత్రం - ప్రాణస్థాపన పూర్వకం
సర్వకార్య సుసిద్ధిస్స్యా - న్నాత్ర కార్యా విచారణా॥

తా॥ అన్ని వేళలందు దీనిని ప్రాణప్రతిష్ఠాపన మొనర్చి ధరించినవారికి సర్వకామ్య సిద్ధి జరుగును. ఇందు సందేహింపవలసిన పనిలేదు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
స్తోత్ర ప్రకార కథనం నామ ద్విసప్తతిః పటలః

త్రిసప్తతిః పటలః
శ్రీ పంచముఖ హనుమద్హృదయం

శ్రీపరాశరః—

శ్లో॥ శృణు మైత్రేయ విప్రేంద్ర హనుమ న్మంత్రసాధనం
మంత్రం సాంగం జపే ద్యస్తు - తస్య సిద్ధి ర్నసంశయః॥

తా॥ శ్రీపరాశరుల వారు చెప్పుచున్నారు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! మైత్రేయా! హనుమన్మంత్ర సాధనమును వినుము. మంత్రాంగములతో

యథావిధిగా ఎవడు మంత్రమును జపించునో వానికి నిశ్చయముగ జప సిద్ధి కల్గును.

శ్లో॥ స ఏవ సిద్ధిదం చైవ — స ఏవఫలదం తథా
తద్ధి నిత్యపురశ్చర్యా - సర్వసాధన ముత్తమమ్॥

తా॥ ఆసాంగముగ జపింపబడిన మంత్రమే సర్వసిద్ధుల నిచ్చునది, సమస్త ప్రయోజనముల సాధించునది. అట్లు సాంగముగ జపించుటే సర్వ సాధకమగు ఉత్తమమైన నిత్యపురశ్చర్య అగును.

శ్లో। హృదయం, పంజరం, స్తోత్రం - పూర్వస్యాంగాని వై మునే౹
మాలా కవచ స్తోత్రాణి - ఉత్తరాంగాః ప్రకీర్తితాః॥

తా॥ హృదయము, పంజరము, స్తోత్రము అనునవి మంత్రమునకు పూర్వాంగములు. మాలామంత్రము, కవచము, స్తోత్రము అనునవి ఉత్తరాంగములుగా చెప్పబడినవి.

శ్లో॥ అదౌ హృదయం వక్ష్యామి - సావధానమనా శృణు॥

తా॥ ముందుగా హనుమద్ధృదయమును చెప్పుచున్నాను. సావధానముగా వినుము.

వ॥ శ్రీ పంచవక్త్రి హనుమ ద్ధృదయస్య ఋషి శ్చైవ శ్రీరామ
చంద్రః భగవాన్ - ఛందోఽనుష్టుప్ - తథా ప్రోక్తా
మంత్రోక్తా దేవతా చ - ఓం బీజం - రుద్రమూర్తయే
శక్తిః ప్రోక్తా - స్వాహా కీలకం - ప్రసాదే చ వినియోగః-
హ్రా మిత్యాది షడంగాని - భూ రిత్యాదిభి ర్దిగ్బంధనమ్॥

ధ్యానం:-

శ్లో॥ ధ్యాయే ద్బాలదివాకర ద్యుతి నిభం దేవారి దర్పాపహం
దేవేంద్ర ప్రముఖ ప్రశస్త యశసం దేదీప్యమానం ఋచా

సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్త తత్త్వప్రియం
సంరక్తారుణ లోచనం పవనజం పీతాంబరాలంకృతమ్॥

తా॥ బాలసూర్యుని కాంతితో సమానమైన వాడును, రాక్షసుల గర్వ మణుచువాడును, దేవేంద్రాది ప్రముఖులచే ఋఙ్మంత్రములతో కీర్తింపబడు ప్రకాశమానమైన కీర్తి కలవాడును, సుగ్రీవాది సమస్త కపివీరులతో కూడినవాడును, బాగుగా వ్యక్తమగు తత్త్వ విషయములం దిష్టుడును, ఎఱ్ఱని కండ్లు కలవాడును, పచ్చని వస్త్రము ధరించిన వాడును వాయు కుమారుడగు హనుమంతుని ధ్యానించుగాక ।

శ్లో॥ ఓం నమో వాయుపుత్రాయ - పంచవక్త్రాయ తే నమః
నమోఽస్తు దీర్ఘవాలాయ - రాక్షసాంతకరాయ చ॥

తా॥ ఓ వాయుపుత్రా నీకు నమస్కారము. ఐదు ముఖములు కల నీకు నమస్కారము. పొడవైన తోకగలయట్టి, రాక్షసులను నాశన మొన ర్చునట్టి నీకు నమస్కారము.

శ్లో॥ వజ్రదేహ! నమ స్తుభ్యం - శతానన మదాపహ!
సీతా సంతోషకరణ! - నమో రాఘవకింకర!॥

తా॥ వజ్రమువంటి దేహము కలవాడా! నీకు నమస్కారము. శతకంఠ మదమణచినవాడా! నీకు నమస్కారము. జానకీదేవికి సంతోషము కల్గించినవాడా! నీకు నమస్కారము. శ్రీరామచంద్రుని సేవకుడా! నీకు నమస్కారము.

శ్లో॥ సృష్టి ప్రవర్తక నమో - మహాస్థిత నమో నమః
కళా కాష్ఠ స్వరూపాయ - మాస సంవత్సరాత్మక!॥

తా॥ ఓ సృష్టి కర్తా! నీకు నమస్కారము. స్థితికర్తా! నీకు నమస్కారము. కళలు, కాష్ఠములు సర్వము రూపమైయున్నవాడా! నీకు నమస్కారము. మాస సంవత్సర స్వరూపా! నీకు నమస్కారము.

శ్లో॥ నమస్తే బ్రహ్మరూపాయ - శివరూపాయ తే నమః
నమో విష్ణుస్వరూపాయ - సూర్యరూపాయ తే నమః

తా॥ బ్రహ్మరూపుడవైన నీకు నమస్కారము. శివస్వరూపుడవైన నీకు నమస్కారము. విష్ణుస్వరూపుడవైన నీకు నమస్కారము. సూర్యరూపుడవైన నీకు నమస్కారము.

శ్లో॥ నమో వహ్నిస్వరూపాయ - నమో గగనచారిణే

తా॥ అగ్నిదేవతా రూపుడవగు హనుమంతా! నీకు నమస్కారము. ఆకాశసంచారివగు నీకు నమస్కారము.

శ్లో॥ సర్వ రంభావన చరః - అశోకవన నాశకః
నమో కైలాసనిలయః - మలయాచల సంశ్రయః॥

తా॥ అరటి తోటలన్నిట వసించువాడా! అశోకవనమును నాశనమొనర్చినవాడా! కైలాసము నిలయమైనవాడా! మలయ పర్వతమున వసించువాడా! నీకు నమస్కారము.

శ్లో॥ నమో రావణనాశాయ - ఇంద్రజి ద్వధకారిణే
మహాదేవాత్మక నమో - నమో వాయు తనూభవ॥

తా॥ రావణ నాశకునకు నమస్కారము. ఇంద్రజిత్తు వధకు కారకుడైన వానికి నమస్కారము. పరమేశ్వర స్వరూపునకు నమస్కారము. వాయుసుతునకు నమస్కారము.

శ్లో॥ నమ స్సుగ్రీవసచివః - సీతా సంతోషకారణః
సముద్రోల్లంఘన నమో - సౌమిత్రేః ప్రాణదాయకః

తా॥ ఓ సుగ్రీవమంత్రీ! నీకు నమస్కారము. జానకీదేవికి సంతోషము కల్గించినవాడా! నీకు నమస్కారము. సముద్రమును దాటినవాడా! నమస్కారము. లక్ష్మణునకు ప్రాణదానమొనర్చినవాడా! నీకు నమస్కారము.

శ్లో॥ మహావీర! నమ స్తుభ్యం - దీర్ఘబాహో! నమోనమః
దీర్ఘవాల నమ స్తుభ్యం వజ్రదేహ ! నమో నమః॥

తా॥ ఓ మహావీరా! నీకు నమస్కారము. ధీర్ఘబాహా నమస్కారము. పొడవగు తోకగలవాడా! నీకు నమస్కారము. వజ్రమువంటి దేహము కలవాడా! నీకు నమస్కారము.

శ్లో॥ ఛాయాగ్రహ హర నమో - వర సౌమ్యముఖేక్షణ!
సర్వదేవ సుసంసేవ్య - మునిసంఘ నమస్కృత!॥

తా॥ ఛాయాగ్రాహిని నాశన మొనర్చినవాడా! నమస్కారము. శ్రేష్టమగునట్టి, సౌమ్యములైనట్టి చూపులు కలవాడా! నమస్కారము. సర్వదేవతల చేత సేవింపబడువాడా నమస్కారము. ముని సమూహముచే నమస్కరిపబడినవాడా! నీకు నమస్కారము.

శ్లో॥ అర్జునధ్వజ సంవాస! కృష్ణార్జున సుపూజిత!
ధర్మార్థ కామ మోక్షాఖ్య పురుషార్థ ప్రవర్తక!

తా అర్జునుని ధ్వజమున వసించువాడా! నమస్కారము. కృష్ణార్జునులచే పూజింపబడినవాడా! నమస్కారము. ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములకు ప్రవర్తకుడా! నీకు నమస్కారము.

శ్లో॥ బ్రహ్మాస్త్ర వంద్య భగవన్ - ఆహ తాసురనాయక!
భక్త కల్పమహాభూజ! - భూత భేతాళ నాశక!॥

తా॥ బ్రహ్మాస్త్రముచే నమస్కరింపబడినవాడా! భగవానుడా! రాక్షస నాయకులను నాశనమొనర్చినవాడా! భక్తులకు కల్పవృక్షము వంటివాడా! భూతభేతాళములను నాశన మొనర్చువాడా! నీకు నమస్కారము.

శ్లో॥ దుష్టగ్రహ హరానంత! వాసుదేవ నమోస్తు తే
శ్రీరామకార్యే చతుర! పార్వతీగర్భ సంభవ!॥

తా॥ దుష్టగ్రహములను హరించువాడా! అంతము లేనివాడా! విష్ణు రూపా! నీకు నమస్కారము. శ్రీరాముని పనులందు నేర్పున చరించు వాడా! పార్వతీ నందనుడా నీకు నమస్కారము.

శ్లో॥ నమః పంపావన చరః - ఋష్యమూక కృతాలయః
ధాన్యమాలీ శాపహరః కాలనేమి నిబర్హణః॥

తా॥ పంపానదీ జలముల సంచరించువాడా! ఋష్యమూక పర్వత మును నివాసముగా పొందినవాడా! ధాన్యమాలి శాపము పోగొట్టినవాడా! కాలనేమిని సంహరించినవాడా నీకు నమస్కారము.

శ్లో॥ సువర్చలా ప్రాణనాథః - రామచంద్ర పరాయణః
నమో వర్గస్వరూపాయః - వర్ణనీయ గుణోదయః॥

తా॥ ఓ సువర్చలా ప్రాణనాయకా! నమస్కారము. శ్రీరామ చంద్రునియందే ఆసక్తి కలవాడా! నమస్కారము. బహురూపముల తోచువాడా నమస్కారము. కొనియాడదగిన గుణములు కలవాడా నీకు నమస్కారము.

శ్లో॥ వరిష్ఠాయ నమ స్తుభ్యం - వేదరూపః నమోనమః
నమ స్తుభ్యం నమ స్తుభ్యం - భూయో భూయో నమా మ్యహమ్॥

తా॥ సర్వశ్రేష్ఠుడా! నీకు నమస్కారము. వేద స్వరూపుడా! నమస్కారము. నీకు నమస్కారము. నీకు నమస్కారము. మరల మరల నేను నీకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఇతి తే కథితం దేవి! - హృదయం శ్రీహనూమతః
సర్వసంపత్కరం పుణ్యం - సర్వసౌఖ్య వివర్ధనమ్॥

తా॥ ఓ పార్వతీ! ఈ నీకు చెప్పినది శ్రీ హనుమంతుని హృదయ స్తోత్రము. ఇది సర్వ సంపదలను ఇచ్చునది. పుణ్యప్రదమైనది. సుఖము లన్నిటిని పెంపొందించునది.

శ్లో॥ దుష్టభూత గ్రహ హరం - క్షయాపస్మార నాశనమ్॥

తా॥ దుష్టభూతములను, గ్రహములను హరించునది. క్షయ, అపస్మారము, మున్నగు భయంకర వ్యాధులను తొలగించునది.

శ్లో॥ య స్త్వాత్మనియయో భక్త్యా వాయుసూనో సుమంగళం
హృదయం పఠతే నిత్యం - స బ్రహ్మ సదృశో భవేత్॥

తా॥ ఎవడైతే ఆత్మనియమము కగిలి భక్తితో ఈ మంగళ ప్రద మగు హనుమత్హృదయమును ప్రతినిత్యము పఠింతురో వారు బ్రహ్మతో సమానమైన వారగుదురు.

శ్లో॥ అజప్త్వం హృదయం యో యః - మంత్రం జపతి మానవః
స దుఃఖం శీఘ్ర మాప్నోతి - మంత్రసిద్ధి ర్న జాయతే॥

తా॥ ఎవరైతే హృదయమును జపింపక మంత్రమును జపింతురో అట్టి మనుష్యులు వెంటనే దుఃఖము పొందుదురు. అట్టివారికి మంత్రము కూడా సిద్ధించదు.

శ్లో॥ సత్యం సత్యం పునః సత్యం - మంత్రసిద్ధికరం పరం
ఇత్థం చ కథితం పూర్వం - సాంచేన స్వప్రియాం ప్రతి॥

తా॥ ఈ హృదయము గొప్పగా మంత్రసిద్ధిని కల్గించునది. ఇది ముమ్మాటికి నిజము. అని పూర్వము పరమశివునిచే పార్వతీదేవికి చెప్ప బడినది.

శ్లో॥ మహర్షేః గౌతమాత్ పూర్వం - మయా ప్రాప్త మిదం మునే।
త న్మయా ప్రహితం సర్వం - శిష్యవాత్సల్య కారణాత్॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! పూర్వ మీహృదయము గౌతమ మహర్షివలన నేను పొందితిని. శిష్యవాత్సల్య కారణమున దానిని నీకు చెప్పితిని.

ఇతిశ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
శ్రీ పంచముఖ హనుమ ద్ధృదయం నామ త్రిసప్తతి తమః పటలః

## చతుస్సప్తతిః పటలః

# హనుమత్పంజర కథనం

శ్రీపరాశరః :-

శ్లో॥ పంజరం తు ప్రవక్ష్యామి - శృణు మైత్రేయ ! ఆదరాత్

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా ! శ్రీపంచ ముఖ హనుమత్పంజర స్తోత్రమును చెప్పుచున్నాను. ప్రీతితో వినవలసినది,

వ॥ అస్య పంజరస్య ఋషిః శ్రీరామచంద్ర భగవా న్నితి చ-
ఛందోఽనుష్టుప్ - శ్రీ పంచవక్త్ర హనుమాన్ దేవతేతి చ-
హ్రాం బీజం - స్వాహా శక్తిః - ప్రణవో కీలకం స్మృతః
మంత్రోక్త దేవతా ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః
దీర్ఘ యామాయయాయుక్తైః - షడంగైః పరికీర్తితః
రామదూత, వానరముఖ - వాయునందన తథా
నృసింహముఖపూర్వకం - అంజనాసూనుః పరం చ
గరుడముఖం చ తథా - హరిమర్కట పదంపరమ్
క్రోడముఖంపదంచాన్తం - రామకార్య ధురంధరః
తతో అశ్వముఖంచాన్తం - సర్వరాక్షసనాశనః
సర్వేముఖ శబ్దాంతాః - సర్వేచతుర్థ్యం తం గతాః
షడంగే కరాంగాదయో హ్రాం షట్కాదిభి స్సంయుతం
న్యసే త్సర్వ మనన్య ధీః - తతో ధ్యానం
పఠిత్వాతు - పూర్వోక్తమార్గతో వాపి-
పంజర మారభే తతః॥

గద్య పద్యోభయాత్మకముగా నుండి అస్పష్టముగా నుండుటవలన యథామూలముగానే విషయ మీయబడినది.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - వందే హరిపదం తతః
ఉచ్చార్య మర్కటపదం - మర్కటాయేతి చోచ్చరేత్॥

తా॥ మొదట ఓంకారము నుచ్చరించి 'హరి' అను పదమును చెప్పి పిమ్మట 'మర్కట' పదము నుచ్చరించి అనంతరము 'మర్కటాయ' అని యుచ్చరింపవలెను.

శ్లో॥ అగ్నిజాయాం సముచ్చార్య - ద్వాదశార్ణో మహామనుః

తా॥ పిదప 'స్వాహా' అని ఉచ్చరించిన అది పండ్రెం డక్షరముల మహా మంత్రమగును.

శ్లో॥ శిరః పాతు మమ సదా - సర్వసౌఖ్య ప్రదాయకః

తా॥ సర్వ సౌఖ్య ప్రదాయకుడగు హనుమంతుడు నా శిరస్సును రక్షించుగాక !

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - కపిబీజం తతో చ్చరేత్
నృసింహబీజ ముచ్చార్య - గారుడం చ సముచ్చరేత్॥

తా॥ ముందు ప్రణవము నుచ్చరించి పిదప హ్రౌం బీజము నుచ్చరింపవలెను. అనంతరము క్ష్రౌం బీజమును, ఆ పిదప క్ష్మ్ల్వ్యౌం బీజ మును ఉచ్చరింపవలెను.

శ్లో॥ వరాహబీజ ముచ్చార్య - హయగ్రీవం తతో చ్చరేత్
నమః పదం తతోచ్చార్య - స పంచాస్యమహాకపేః
చతుర్దశార్ణ మంత్రోఽయం - ముఖం పాయా త్సదామమ॥

తా॥ పిదప గ్లౌం బీజము నుచ్చరించి అనంతరము హ్స్రౌం బీజము చెప్పవలెను. పిదప పంచాస్య హనుమంతునకు నమః అని చెప్పిన అది పంచముఖ హనుమంతుని చతుర్దశార్ణ మంత్రమగును. పంచముఖ హనుమంతుడు నా ముఖమును రక్షించుగాక !

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - నమో భగవతే పదం
పంచవదనాయ చోచ్చార్య - పూర్వముఖేతి చోచ్చరేత్॥

తా॥ మొదట ఓంకారము నుచ్చరించి 'నమో భగవతే' అను పదమునుపైచి 'పంచవదనాయ' అని ఉచ్చరించి 'పూర్వముఖే' అనవలెను.

శ్లో॥ వానరం బీజ ముచ్చార్య - కపిముఖాయ చోచ్చరేత్
సర్వ శత్రుహరాయేతి - మహాబలాయ చోచ్చరేత్।

తా॥ హ్రౌం బీజము నుచ్చరించి 'కపిముఖాయ' అనవలెను. 'సర్వ శత్రు సంహారాయ' అని 'మహాబలాయ' అనునది ఉచ్చరించవలెను.

శ్లో॥ అగ్నిజాయాం తతో చ్చార్య - సప్తత్రింశాక్షరాభిధః
కంఠం మమ సదా పాతు - సర్వశత్రు వినాశకః॥

తా॥ పిదప 'స్వాహా' అని యుచ్చరించిన ఇది ముప్పది యేడక్షరముల మంత్రముగా చెప్పబడుచున్నది. సర్వ శత్రువులను నాశనమొనర్చు హనుమంతుడు నా కంఠము నెప్పుడు రక్షించుగాక।

శ్లో॥ ఉచ్చార్య ప్రణవం చాదౌ - నమో భగవతేతి చ
నారసింహ మహాబీజం - కరాళపద ముచ్చరేత్॥

తా॥ ముందుగా ఓంకారము నుచ్చరించి 'నమోభగవతే' అని క్ష్రౌం బీజముచెప్పి 'కరాళ' పదము నుచ్చరించవలెను.

శ్లో॥ నృసింహాయ పదం చోక్త్వా - సకలభూత ప్రేత చ
పిశాచ బ్రహ్మరాక్షస - ప్రమథనాయ పదం వదేత్॥

తా॥ 'నారసింహాయ' పదముపల్కి 'సకల భూతప్రేత' అని 'పిశాచ బ్రహ్మరాక్షస ప్రమథనాయ' పదమును పలుకవలెను.

శ్లో॥ అగ్నిజాయాం తతోచ్చార్య - వసు వేదార్ణ కో మనుః
హృదయం మే సదా పాతు - సర్వశత్రు వినాశకః॥

తా॥ స్వాహా అనునది పిదప చెప్పవలెను. ఇది ముప్పదియెనిమిది వర్ణముల మంత్రము. సర్వశత్రు వినాశకుడగు హనుమంతుడు నా హృదయము ఎల్లప్పుడు రక్షించుగాక.

శ్లో॥ ఓం నమో భగవతేతి - పంచవదనాయ తతః
పశ్చిమముఖేతి చోచ్చార్య - గారుడం బీజ ముచ్చరేత్॥

తా॥ 'ఓం నమో భగవతే' అని 'పంచవదనాయ' అని పల్కిన పిమ్మట 'పశ్చిమముఖే' అని ఉచ్చరించి క్ష్మ్యం బీజము నుచ్చరింపవలెను.

శ్లో॥ వీరగరుడాయ మహా - బలాయేతి పదం తతః
సర్వనాగ ప్రమథనా - యాంతే సకలవిషేతి॥

తా॥ పిమ్మట 'వీరగరుడాయ మహాబలాయ' అను పదము 'సర్వనాగ ప్రమదనాయ' అని చివఱ 'సకలవిష' అని పలుకవలెను.

శ్లో॥ హరాయ స్వాహా త్వం తతః వేదాభ్యక్షర సంయుతః
హనుమ న్మమోదరం పాతు - సర్వరోగ నిబర్హణః॥

తా॥ పిదప 'హరాయ స్వాహా' అని చెప్పవలెను. సర్వరోగములను పోగొట్టజాలిన నలుబది యారక్షరముల ఈ మంత్రము నా ఉదరమును రక్షించు గాక ॥

శ్లో॥ ఓం నమో భగవతేతి - పంచవదనాయ తతః
ఉత్తరముఖే చోచ్చార్య - క్రోడ వాగ్బీజ ముచ్చరేత్॥

తా॥ ' ఓం నమో భగవతే' అని 'పంచవదనాయ' అను దానిని పిదప చెప్పవలెను. 'ఉత్తరముఖే' అని ఉచ్చరించి గ్లౌం బీజము చెప్పవలెను.

శ్లో॥ ఆదివరాహ సర్వసంపత్ - ప్రదాయ నిధి భూమి చ
ప్రదాయ పశ్చా జ్జ్వ రేతి రోగ నికృంతన స్వాహా॥
నాభిం పాతు మమ సదా - సుఖసౌభాగ్య హేతుకః॥
నేత్ర బాణార్ణకో మనోః - పశ్చాత్ ప్రణవ ముచ్చరేత్॥

తా॥ 'ఆది వరాహాయ సర్వసంపత్ప్రదాయ నిధి భూమి ప్రదాయ జ్వర ఈతి రోగ నికృంతనాయ స్వాహా' అని చెప్పవలెను. సుఖ సౌభా

గ్యాలకు కారకుడైన హనుమంతుడు నా నాభిని రక్షించు గాక ; ఇది ఏబది రెండక్షరముల మంత్రము. తరువాతి మంత్రమునకై ముందుగ ప్రణవము నుచ్చరింపవలెను.

శ్లో॥ నమో భగవతే పంచ - వదనాయ పదం తతః
ఊర్ధ్వముఖే త్యంతే — హయబీజం తతః పరమ్॥

తా॥ 'నమో భగవతే పంచవదనాయ' అని పిదప ఊర్ధ్వముఖే అని 'హౌం' బీజమునుంచి

శ్లో॥ హయగ్రీవాయ సకల - ప్రదాయ సకలేతి చ
జన వశీకరణాయ సకల దానవాంతకాయ॥

తా॥ 'హయగ్రీవాయ సకలప్రదాయ' అని 'సకల' అని మరల చెప్పి జన వశీకరణాయ అని సకల దానవాంతకాయ అనవలెను.

శ్లో॥ పశ్చాత్ప్రాజ్ఞాయ స్వాహేతి - షట్పంచాశ దర్ణకో మనుః
మమ జానుద్వయం పాతు - సర్వరాక్షస నాశకః॥

తా॥ పిదప ప్రాజ్ఞాయ స్వాహా అని చెప్పిన ఏబది యారక్షరముల మంత్రమగును. సర్వరాక్షసనాయకుడైన హనుమంతుడు నా జానుద్వయ మును రక్షించుగాక।

శ్లో॥ ఓం చ హ్రీ మిత్యయం చోక్త్వా - నమో భగవతే తతః
బ్రహ్మాస్త్ర సంహారకాయ - రాక్షసకుల నాశయేతి॥

తా॥ ఓం అని హ్రీం అని పల్కి నమోభగవతే అనిన పిదప బ్రహాస్త్ర సంహారకాయ అని రాక్షసకుల నాశాయ అని

శ్లో॥ పతాక హనుమతేతి - మాయాబీజత్రయం తతః
క్రోడాస్త్ర వహ్నిజాయాం తం - మనుః పాదద్వయం మమ॥

తా॥ పతాక హనుమతే అని ఇం ఇం ఇం గ్లౌం స్వాహా అని చెప్పిన మంత్రము నా పాదములను రక్షించుగాక।

శ్లో॥ హ్రాం నమః పంచవక్త్రాయ - నాభిదేశం సదా మమ
హ్రీం నమః పంచవక్త్రాయ - పాతు జంఘద్వయం మమ॥

తా॥ హ్రాం నమః పంచవక్త్రాయ ఎల్లప్పుడు నా నాభి ప్రదేశమును రక్షించుగాక! హ్రీం నమః పంచవక్త్రాయ ఎల్లప్పుడు నా పిక్కల రెంటిని రక్షించుగాక. ఇట్లు ఆయా అవయవములతో చెప్పిన క్రమమంతము ప్రత్యేకభావ మవసరములేదు. కావున యథా మూల మీయబడుచున్నది.

శ్లో॥ హ్రాం నమః పంచవక్త్రాయ - నాభిదేశం సదా మమ
హ్రీం నమః పంచవక్త్రాయ - పాతు జంఘద్వయం మమ।
హ్రూం నమః పంవక్త్రాయ- పాతు జానుద్వయం మమ
హ్రైం నమః పంచవక్త్రాయ - పాదద్వంద్వం సదావతు।
హ్రౌం నమః పంచవక్త్రాయ- కటిదేశం సదావతు।
హ్రః నమః పంచవక్త్రాయ - చోదరం పాతు సర్వదా।
ఐం నమః పంచవక్త్రాయ - హృదయం పాతు సర్వదా।
క్లాం నమః పంచవక్త్రాయ - బాహుయుగ్మం సదావతు।
క్లీం నమః పంచవక్త్రాయ - కరయుగ్మం సదామమ।
క్లూం నమః పంచవక్త్రాయ - కంఠదేశం సదావతు।
క్లైం నమః పంచవక్త్రాయ - చుబుకం మే సదావతు।
క్లౌం నమః పంచవక్త్రాయ - పాతు చోష్ఠద్వయం మమ
క్లః నమః పంచావక్త్రాయ - నేత్రయుగ్మం సదావతు
రాం నమః పంచవక్త్రాయ - శ్రోత్రయుగ్మం సదావతు
రీం నమః పంచవక్త్రాయ - ఫాలం పాతు మహాబలః
రూం నమః పంచవక్త్రాయ - శిరః పాయా త్సదా మమ
రైం నమః పంచవక్త్రాయ - శిఖాం మమ సదావతు।
రౌం నమః పంచవక్త్రాయ - మూర్ధానం పాతు సర్వదా।

రః నమః పంచవక్త్రాయ - ముఖం పాతు సదా మమ।
క్షౌం నమః పంచ వక్త్రాయ - శ్రోత్రయుగ్మం సదావతు।
క్షీం నమః పంచవక్త్రాయ - నేత్రయుగ్మం సదా మమ।
క్షూం నమః పంచవక్త్రాయ - పాతు చోష్ఠద్వయం మమ।
క్షైం నమః పంచవక్త్రాయ - భ్రూయుగ్మం పాతు సర్వదా।
క్షౌం నమః పంచవక్త్రాయ - నాసికాం పాతు సర్వదా।
క్షః నమః పంచవక్త్రాయ - కంఠం పాతు కపీశ్వరః।
గ్లాం నమః పంచవక్త్రాయ - పాతు వక్షస్థలం మమ।
గ్లీం నమః పంచవక్త్రాయ - బాహుయుగ్మం సదా మమ।
గ్లూం నమః పంచవక్త్రాయ - కరయుగ్మం సదావతు।
గ్లైం నమః పంచవక్త్రాయ - మమ పాతు వళిత్రయం।
గ్లౌం నమః పంచవక్త్రాయ - చోదరం పాతు సర్వదా।
గ్లః నమః పంచవక్త్రాయ - నాభిం పాతు సదా మమ।
అం నమః పంచవక్త్రాయ - వానరాయ కటిం మమ।
ఈం నమః పంచవక్త్రాయ - ఊరుయుగ్మం సదావతు।
ఊం నమః పంచవక్త్రాయ - జానుద్వంద్వం సదా మమ।
ఐం నమః పంచవక్త్రాయ - గుల్ఫద్వంద్వం సదావతు।
ఔం నమః పంచవక్త్రాయ - పాదద్వంద్వం సదావతు।
అః నమః పంచవక్త్రాయ - సర్వాంగాని సదావతు।

శ్లో॥ వానరః పూర్వతః పాతు - దక్షిణే నరకేసరిః
ప్రతీచ్యాం పాతు గరుడః - ఉత్తరే పాతు సూకరః
ఊర్ధ్వం హయాననః పాతు - సర్వతః పాతు మృత్యుహా॥

తా॥ తూర్పు దిక్కున వానర రూపము రక్షించుగాక। దక్షిణ దిక్కున నరసింహ రూపము రక్షించుగాక। పశ్చిమ దిక్కున గరుత్మంతుడు రక్షించుగాక। ఉత్తర దిక్కునందు వరాహమూర్తి రక్షించుగాక।

ఊర్ధ్వ దిక్కున అశ్వముఖ రూపము రక్షించుగాక। మృత్యుంజయ రూపము అంతట రక్షించుగాక।.

శ్లో॥ వానరః పూర్వతః పాతు - ఆగ్నేయ్యాం వాయునందనః
దక్షిణే పాతు హనుమాన్ - నిర్ఋతే కేసరీప్రియః॥

తా॥ తూర్పున వానరమూర్తి రక్షించుగాక। ఆగ్నేయ దిక్కున వాయునందన రూపము రక్షించుగాక। దక్షిణమున హనుమన్మూర్తి రక్షించుగాక। నైఋతి దిక్కున కేసరీ ప్రియుడు రక్షించుగాక।.

శ్లో॥ ప్రతీచ్యాం పాతు దైత్యారిః - వాయవ్యాం పాతు మంగళః
ఉత్తరే రామదాస స్తు - నిమ్నయుద్ధ విశారదః॥

తా॥ పశ్చిమ దిక్కున రాక్షసారి రక్షించుగాక। వాయువ్య దిక్కున మంగళరూపుడు రక్షించుగాక। ఉత్తర దిక్కున రామదాసు రక్షించుగాక। గంభీరముగ యుద్ధము చేయునేర్పరి రక్షించుగాక।.

శ్లో॥ ఊర్ధ్వే రామసఖః పాతు - పాతాళే చ కపీశ్వరః
సర్వతః పాతు పంచాస్యః - సర్వరోగ వికృంతనః॥

తా॥ ఊర్ధ్వ దేశమున రామ సఖుడు రక్షించునుగాక। పాతాళమున కపీశ్వరుడు రక్షించుగాక। పంచముఖ హనుమంతుడు సర్వరోగములను పోగొట్టుచు అంతట రక్షించుగాక।

శ్లో। హనూమాన్ పూర్వతః పాతు - దక్షిణే పవనాత్మజః
పాతు ప్రతీచీ మక్షఘ్నో - ఉదీచ్యాం సాగరతారకః

తా॥ తూర్పున హనుమద్రూపుడు రక్షించుగాక, దక్షిణ దిక్కున వాయు కుమారుడు రక్షించుగాక। పశ్చిమ దిక్కున అక్షరాక్షస నాశకుడు రక్షించుగాక। ఉత్తర దిక్కున సముద్రమును దాటినవాడు రక్షించునుగాక।

శ్లో॥ ఊర్ధ్వం కేసరీనందనః - పాత్వధస్తా ద్విష్ణుభక్తః
పాతు మధ్యప్రదేశే తు - సర్వలంకా విదాహకః॥

తా॥ ఊర్ధ్వభాగమున కేసరీనందనుడు రక్షించుగాక ; అధోభాగమున విష్ణుభక్తుడు రక్షించుగాక ; మధ్యప్రదేశమునందు లంకనంతను దహించి వైచిన హనుమంతుడు రక్షించుగాక ;

శ్లో॥ ఏవం సర్వతో మాం పాతు - పంచవక్త్రః సదా కపిః

తా॥ ఈ రీతిగా పంచముఖాంజనేయుడు నన్ను అంతట రక్షించుగాక ;

శ్లో॥ సుగ్రీవసచివః పాతు - మస్తకం మమ సర్వదా
వాయునందనః ఫాలం మే - మహావీరః భ్రూమధ్యమమ్

తా॥ నా శిరస్సును సుగ్రీవుని మంత్రి ఎల్లప్పుడు రక్షించుగాక ; వాయునందనుడు నా ఫాల ప్రదేశమును రక్షించుగాక ; మహావీరుడు నా కనుబొమలమధ్య ప్రదేశమును రక్షించుగాక ;

శ్లో॥ నేత్రే ఛాయాపహారీ చ - పాతు శ్రోత్రే ప్లవంగమః
కపోలౌ కర్ణమూలే చ - పాతు శ్రీరామకింకరః॥

తా॥ ఛాయాగ్రాహిని సంహరించినవాడు నేత్రములను రక్షించుగాక ; వానరరూపుడు చెవులను రక్షించుగాక ; శ్రీరామసేవకుడు నా చెక్కిళ్ళను, కర్ణమూలమును రక్షించుగాక ;

శ్లో॥ నాసాగ్ర మంజనాసూనుః - పాతు వక్త్రః హరీశ్వరః॥
పాతు కంఠం చ దైత్యారిః - స్కంధౌ పాతుసురార్చితః।

తా॥ నాసికాగ్రమును అంజనాదేవి తనయుడు రక్షించుగాక ; వానరశ్రేష్ఠుడు ముఖమును రక్షించుగాక ; రాక్షసాంతకుడు కంఠమును రక్షించుగాక ; దేవతలచే నర్చింపబడుస్వామి మూపు భాగము రక్షించుగాక ;

శ్లో॥ జానౌ పాతు మహాతేజః - కూర్పరౌ చరణాయుధః
నఖాన్ నఖాయుధః పాతు - కక్షం పాతు కపీశ్వరః॥

తా॥ మహాతేజస్వంతుడగువాడు మోకాళ్ళను రక్షించుగాక ! చరణములు ఆయుధములుగా కలవాడు మోకాలి చిప్పలను రక్షించుగాక ! గోళ్ళు ఆయుధములుగా కలవాడు గోళ్ళను రక్షించుగాక ! కపీశ్వరుడు కక్ష భాగమును రక్షించుగాక !

శ్లో॥ సీతాశోకాపహారీ తు - స్తనౌ పాతు నిరంతరం
లక్ష్మణ ప్రాణదాతా అసః - కుక్షిం పా త్వనిశం మమ॥

తా॥ జానకి దుఃఖము పోగొట్టినవాడు ఎల్లప్పుడు నా స్తనములను రక్షించుగాక ! లక్ష్మణునికి ప్రాణదాన మొనర్చినవాడు ఎల్లప్పుడు నా పొట్టను రక్షించుగాక !

శ్లో॥ వక్షౌ ముద్రాపహారీ చ - పాతు పార్శ్వే భుజాయుధః
లంఖిణీభంజనః పాతు - పృష్ఠదేశే నిరంతరమ్॥

తా॥ ముద్రికను గొంపోయినవాడు వక్షస్థలమును రక్షించుగాక ! భుజము ఆయుధముగాగల స్వామి పార్శ్వభాగముల రక్షించుగాక ! లంఖిణిని నాశనమొనర్చినవాడు ఎల్లప్పుడు పృష్ఠదేశములను రక్షించుగాక !

శ్లో॥ నాభిం చ రామదాస స్తు - కటిం పా త్వనిలాత్మజః
గుహ్యం పాతు మహాప్రాజ్ఞః - సన్ధౌ పాతు శివప్రియః॥

తా॥ రామదాసు బొడ్డును రక్షించుగాక ! వాయు కుమారుడు కటి ప్రదేశమును రక్షించుగాక ! మహాజ్ఞానియగువాడు రహస్య ప్రదేశమును రక్షించుగాక ! శివప్రియుడగువాడు సంధిస్థానములను రక్షించుగాక !

శ్లో॥ ఊరూ చ జానునీ పాతు - లంకాప్రాసాద భంజనః
జంఘౌ పాతు కపిశ్రేష్ఠః - గుల్ఫౌ పాతు మహాబలః॥

తా॥ లంకా ప్రాసాదమును నాశన మొనర్చినవాడు తొడలను, మోకాళ్ళను రక్షించుగాక ! వానరశ్రేష్ఠుడు పిక్కలను రక్షించుగాక ! మహాబలుడగువాడు చీలమండలను రక్షించుగాక !

శ్లో॥ అచలోద్ధారకః పాతు - పాదౌ భాస్కరసన్నిభః
అంగా న్యమితసత్వాఢ్యః - పాతు పాదాంగుళీ స్సదా॥

తా॥ పర్వతము నెత్తినెట్టివాడు పాదములను రక్షించుగాక; సూర్య సమానుడైనవాడు అవయవములను రక్షించుగాక; మిక్కిలి బలముచే గొప్పవాడగు స్వామి కాలి వ్రేళ్ళను రక్షించుగాక;

శ్లో॥ సర్వాంగాని మహాశూరః - పాతు మాం రోమవాన్ సదా
భార్యాం పాతు మహాతేజః - పుత్రాన్ పాతు నఖాయుధః॥

తా॥ మహాశూరుడగువాడు సర్వాంగములన రక్షించుగాక; రోమవంతుడగువాడు నన్ను రక్షించుగాక; గోళ్ళు ఆయుధముగా కలవాడు పుత్రులను రక్షించుగాక;

శ్లో॥ పశూన్ పంచాననః పాతు - క్షేత్రం పాతు కపీశ్వరః
బంధూన్ పాతు రఘుశ్రేష్ఠ - దాసః పవనసంభవః

తా॥ పంచముఖస్వామి పశువులను రక్షించుగాక; కపినాయకుడు పొలమును రక్షించుగాక; రఘుకుల శ్రేష్ఠుని రామచంద్రుని దాసుడు, వాయు తనయుడునగువాడు బంధువులను రక్షించుగాక;

శ్లో॥ సీతా శోకాపహారీ సః - గృహాన్ మమ సదావతు

తా॥ జానకీ శోకమును తొలగించినవాడు నా గృహముల నెల్లప్పుడు రక్షించుగాక;

శ్లో॥ హనూమ త్పంజరం య స్తు - పఠే ద్విద్వాన్ విచక్షణః
స ఏష పురుషశ్రేష్ఠో - భుక్తిం ముక్తిం చ విందతి।

తా॥ విచక్షణాజ్ఞానముకల విద్వాంసుడెవ్వడు ఈ హనుమత్పంజరమును పఠించునో అట్టి పురుషశ్రేష్ఠుడు ఇహమున భుక్తిని, పరమున ముక్తిని పొందగలడు.

శ్లో॥ కాలత్రయేఽప్యేకకాలే - పఠేన్మాసత్రయం నరః
సర్వ శత్రూన్ క్షణే జిత్వా - స్వయం చ విజయీ భవేత్॥

తా॥ ఉదయ మధ్యాహ్న సాయంకాలములం దొక్కపూటచొప్పున మూడు నెలలు పఠించినచో ఆ మనుష్యుఁడు సర్వ శత్రువులను జయించి తానుగా విజయుఁడగును.

శ్లో॥ అర్ధరాత్రౌ జలే స్థిత్వా - సప్తవారం పఠేద్యది
క్షయాపస్మార కుష్ఠాది - తాపజ్వర నివారణమ్।

తా॥ అర్ధరాత్రియందు నీటిలోనుండి ఏడువారములు పఠించినచో క్షయ, మూర్ఛ, కుష్ఠు వంటివి, తాపజ్వరముల నివారణ మగును.

శ్లో॥ అర్కవారేఽశ్వత్థమూలే - స్థిత్వా పఠతి యః పుమాన్
స పుమాన్ శ్రియ మాప్నోతి - సంగ్రామే విజయీ భవేత్।

తా॥ ఆదివారమునాడు రావిచెట్టు మొదట కూర్చొని ఏ మనుష్యుఁడు పఠించునో ఆ మనుష్యుఁడు సంపదలను పొందగలఁడు; యుద్ధమునను విజయము నందగలఁడు.

శ్లో॥ అనేన మంత్రితం చాపి - యః పిబేత్ రోగపీడితః
స నరో రోగనిర్ముక్తః - సుఖీ భవతి నిశ్చయః।

తా॥ ఈ హనుమత్పంజరముతో మంత్రించబడిన నీటిని రోగ పీడితుఁడు త్రాగినచో ఆ మనుష్యుఁడు రోగమునుండి విముక్తిచెంది నిశ్చయముగా సుఖవంతుఁడగును.

శ్లో॥ యో నిత్యం ధ్యాయేద్యస్తు - సర్వమంత్ర వినిర్మితం
తం దృష్ట్వా దేవతా స్సర్వే - నమస్యంతి కపీశ్వరమ్॥

తా॥ ఎవఁడైతే సర్వమంత్రములచే నిర్మించబడిన పంజరము నెవరు నిత్యము ధ్యానము చేయుదురో వానిని చూచి దేవతలందరు హనుమంతుని గూర్చి నమస్కరించగలరు.

శ్లో॥ రాక్షసా స్తు పలాయంతే భూతా ధావన్తి సర్వతః

తా॥ దీని పఠనమువలన రాక్షసులు, భూతాదులును భయమున పరుగిడి అన్నివైపులకు పారిపోవును.

శ్లో॥ ఇదం పంజర మజ్ఞాత్వా - యో జప న్మంత్రనాయకం
న శీఘ్రం ఫల మాప్నోతి - సత్యం సత్యం మయోదితమ్॥

తా॥ ఈ హనుమత్పంజరమును తెలిసికొనక మంత్ర రాజమును కేవలముగా ఎవరు జపింతురో అట్టివారు త్వరగా మంత్రసిద్ధిని పొందలేరు. ఈ నేను చెప్పిన విషయము ముమ్మాటికి యథార్థము.

శ్లో॥ త్రికాల మేకకాలం వా - పంజరం ధారయే చ్ఛుభం
పంజరం విధివ జ్జప్త్వా - స్తోత్రైః వేదాంతసమ్మితైః
తోషయే దంజనాసూనుం - సర్వరాక్ష సమర్దనమ్॥

తా॥ రోజున మూడువేళలకాని లేదా ఒక్కమారుకాని శుభప్రదమగు పంజరమును పఠింపవలెను. యథావిధిగా పంజరమును జపించి రాక్షసమర్దనుడైన శ్రీఆంజనేయుని వేదాంతమిశ్రితములైన స్తోత్రములతో సంతోషపెట్టవలెను.

శ్లో॥ ఇతీదం పంజరం యస్తు - పంచవక్త్రి హనూమతః
ధారయేత్ శ్రావయే ద్వాపి - కృతకృత్యో భవే న్నరః॥

తా॥ ఈ పంచముఖాంజనేయుని పంజరమును ఎవరు పఠింతురో లేదా ఎవరు విందురో వారు ధన్యులౌదురు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పరాశరమైత్రేయ సంవాదే
పంచముఖ హనుమన్మంత్రవివరణే
శ్రీపంచముఖ హనుమత్పంజరం నామ చతుస్సప్తతితమః పటలః.

పంచ సప్తతిః పటలః

# శ్రీ హనుమదష్టోత్తరశతనామ స్తోత్రం

శ్రీ పరాశరః :—

శ్లో॥ శృణు మైత్రేయః మంత్రజ్ఞః - అష్టోత్తరశత సంజ్ఞికః
నామ్నా హనుమత శ్చైవ - స్తోత్రాణాం శోకనాశనమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మంత్రజ్ఞుడవైన మైత్రేయ మహామునీ! వినుము. హనుమంతుని పేరగల ఈ అష్టోత్తర శతము స్తోత్రము చేసిన వారి దుఃఖమును నివారించునది.

శ్లో॥ పూర్వం శివేన పార్వత్యాః - కథితం పాపనాశనం
గోప్యా ద్గోప్యతరం చైవ - సర్వేప్సిత ఫలప్రదమే॥

తా॥ ఈ స్తోత్రము పూర్వము శివునిచే పార్వతిదేవికి చెప్పబడినది. కోరికలన్నిటిని తీర్చగల ఇది మిక్కిలి రహస్యముగా నుంచదగినది.

శ్లో॥ ఋషి స్సదాశివః ప్రోక్తో - ఛందోఽనుష్టు బుదాహృతః
హనూమాన్ దేవతా ప్రోక్తో - హ్రాం బీజ మితి చ స్మృతః
హ్రీం శక్తి హ్రూం కీలకం చ - ప్రసాదే చ వినియోగః॥

తా॥ ఈ అష్టోత్తర శతనామ స్తోత్రమునకు ఋషి సదాశివుడు; అనుష్టుప్ చందస్సు; శ్రీ హనుమాన్ దేవత; హ్రాంబీజం; హ్రీంశక్తిః హ్రూం కీలకం అని తెలిసికొన వలసినది. హనుమత్ప్రసాదమునందు వినియోగము.

ధ్యానం :—

శ్లో॥ ధ్యాయే జ్జ్వల దివాకర ద్యుతి నిభం దేవారి దర్పాపహం
దేవేంద్ర ప్రముఖ ప్రశస్త యశసం దేదీప్యమానం ఋచా

హస్తాబ్జైయి రసి ఖేట పుస్తక సుధాకుంభం కుశాద్రీన్ హలం
ఖట్వాంగం ఫణి భూరుహం చ దధతం సర్వారి గర్వాపహమ్॥

తా॥ బాల సూర్యుని కాంతితో సమానమైన కాంతికలవాడును, రాక్షసుల గర్వమణచు వాడును, దేవేంద్రాది ప్రముఖులతో ఋఙ్మంత్రముల ద్వారా కీర్తింపబడు యశస్సుకల వాడును, దేదీప్యమానుడును, పద్మముల వంటి హస్తములతో కత్తి, డాలు, పుస్తకము, అమృతకలశము, దర్భలు పర్వతము, నాగలి, మంచపుకోడు, సర్పము, చెట్టు మున్నగు ఆయుధములను ధరించిన వాడును, శత్రువులందఱి గర్వమునణచు వాడును అగు హనుమంతుని ధ్యానింప వలెను.

శ్లో॥ హనూమాన్ స్థిరకీర్తి శ్చ – తృణీకృత జగత్త్రియః
సురపూజ్య స్సురశ్రేష్ఠో – సర్వాధీశ స్సుఖప్రదః॥

తా॥ హనుమంతుడు, స్థిరమైన కీర్తి కలవాడు, ముల్లోకములను గడ్డిపోచగా నెంచినవాడు, దేవతలకు పూజింపదగినవాడు, దేవతలలో శ్రేష్ఠుడు, సర్వమునకు అధిపతి, సుఖమునిచ్చువాడు.

శ్లో॥ జ్ఞానప్రదో జ్ఞానగమ్యో – విజ్ఞానీ విశ్వవందితః
వజ్రదేహో రుద్రమూర్తీ – దగ్ధ లంకా వరప్రదః॥

తా॥ జ్ఞానమునిచ్చువాడు, జ్ఞానమే గమ్యమైనవాడు, విజ్ఞాని, ప్రపంచముచే నమస్కరింపబడినవాడు, వజ్రము వంటి దేహము కలవాడు, రుద్రరూపము కలవాడు, లంకను తగులబెట్టినవాడు, వరముల నిచ్చువాడు.

శ్లో॥ ఇంద్రజి ద్భయకర్తా చ – రావణస్య భయంకరః
కుంభకర్ణస్య భయదో – రమాదాసో కపీశ్వరః॥

తా॥ ఇంద్రజిత్తును భయపెట్టువాడు, రావణునకు భయంకరుడు, కుంభకర్ణునకు భయము కల్గించువాడు, లక్ష్మికి దాసుడు, వానరనాయకుడు

శ్లో॥ లక్ష్మణానందకరో దేవో - కపిసైన్యస్య రక్షకః
సుగ్రీవ సచివో మంత్రీ - పర్వతోత్పాటనో ప్రభుః॥

తా॥ లక్ష్మణున కానందము కల్గించిన వాడు, దేవుడు, వానరసేనకు సంరక్షకుడు, సుగ్రీవునకు సచివుడు, మంత్రాంగ మెరిగినవాడు, పర్వత మును పెకలించిన వాడు, సమర్థుడైన వాడు,

శ్లో॥ ఆజన్మబ్రహ్మచారీ చ - గంభీరధ్వని భీతిదః
సర్వేశః జ్వరహారీ చ - గ్రహకూట వినాశకః॥

తా॥ ఆజన్మ బ్రహ్మచారియైన వాడు, గంభీరమైన ధ్వని కలవాడు భయమును కల్గించువాడు, సమస్తమునకు అధిపతి, జ్వరమును పోగొట్టు వాడు, గ్రహకూటమును వినాశమొనర్చువాడు.

శ్లో॥ ఢాకినీ ధ్వంసక స్సర్వ - భూత ప్రేత విదారణః
విషహర్తా చ విభవో - నిత్య స్సర్వలోకనాథః॥

తా॥ ఢాకినీ ధ్వంసకుడు, సర్వ భూత ప్రేత విదారణ మొనర్చు వాడు, విషమును హరించువాడు, గొప్పతనము కలవాడు, నిత్యుడు, సర్వ లోకములకు నాధుడు.

శ్లో॥ భగవా న్కుండలీ దండీ - స్వర్ణయజ్ఞోపవీతధృత్
అగ్నిగర్భ స్స్వర్ణకాంతిః - ద్విభుజ స్తు కృతాంజలిః॥

తా భగవంతుడు, కుండలములు కలవాడు, దండము కలవాడు, బంగారు జందెము కలవాడు, అగ్నిగర్భుడు, బంగారుకాంతి కలవాడు, రెండు బుజములు కలవాడు, అంజలి ఘటించినవాడు.

శ్లో॥ బ్రహ్మాస్త్రవారణ శ్శాంతో - బ్రహ్మణ్యో బ్రహ్మరూపధృత్
శత్రుహన్తా కార్యదక్షో - లలాటాక్షోఽపరేశ్వరః॥

తా॥ బ్రహ్మాస్త్రమును నివారించినవాడు, శాంతరూపుడు, వేదములు చక్కగా చదివినవాడు, బ్రహ్మరూపము ధరించినవాడు, శత్రువులను

చంపినవాడు, పనియందు సమర్థుడు, నుదుట కన్నుగలవాడు, వేరొక ఈశ్వరరూపమైన వాడు.

శ్లో॥ లంకోద్దీపో మహాకాయః - రణశూరో ఽమితప్రభః
వాయువేగీ మనోవేగీ - గరుడస్య సమో జవే॥

తా॥ లంకను తగులబెట్టినవాడు, పెద్ద శరీరము కలవాడు, యుద్ధమునందు పరాక్రమము కలవాడు, అంతులేని కాంతి కలవాడు, వాయువు వంటి వేగము కలవాడు, మనోవేగము కలవాడు, వేగమున గరుత్మంతునితో సమానమైన వాడు.

శ్లో॥ మహాత్మా విష్ణుభక్తశ్చ - భక్తాభీష్ట ఫలప్రదః
సంజీవినీ సమాహర్తా - సచ్చిదానంద విగ్రహః॥

తా॥ మహాత్ముడు, విష్ణుభక్తుడు, భక్తులు కోరిన ఫలమునిచ్చువాడు, సంజీవినీ పర్వతమును తెచ్చినవాడు, సత్యజ్ఞాన ఆనందములు రూపు దాల్చినవాడు.

శ్లో॥ త్రిమూర్తీ పుండరీకాక్షో - విశ్వజి ద్విశ్వభావనః
విశ్వహర్తా విశ్వకర్తా - భవ దుఃఖైక భేషజః॥

తా॥ త్రిమూర్తి స్వరూపుడును, తెల్లదామర బోలు నేత్రములు కలవాడును, విశ్వమును జయించిన వాడును, విశ్వమునకు కారణమైన వాడును, విశ్వమును హరించువాడును, విశ్వమునొనర్చినవాడును, సంసార దుఃఖమునకొకే ఒక ఔషధమైన వాడును.

శ్లో॥ వహ్నితేజో మహాశాంతో - చంద్రస్య సదృశో భవః
సేతుకర్తా కార్యదక్షో - భక్తపోషణ తత్పరః

తా॥ అగ్నివంటి తేజస్సు కలవాడును, మహాశాంతుడును, చంద్రునితో సమానమైన వాడును, శివస్వరూపుడును, సేతువును నిర్మించినవాడును, కార్యసమర్థుడును, భక్తులను పోషించుటలో నిమగ్నుడై యుండువాడును.

శ్లో॥ మహాయోగీ మహాధైర్యో - మహాబల పరాక్రమః
అక్షహంతా రాక్షసఘ్నో - ధూమ్రాక్షవధకృ న్మునే।

తా॥ మైత్రేయ మహామునీ। ఇంకను మహాయోగియు, మిక్కిలి ధైర్యము కలవాడు, మిక్కిలి బలపరాక్రమములు కలవాడు, అక్షరాక్షసుని చంపినవాడు. రాక్షసుల సంహరించినవాడు, ధూమ్రాక్షుని సంహరించినవాడు.

శ్లో॥ గ్రస్తసూర్యః శాస్త్రవేత్తా - వాయుపుత్రః ప్రతాపవాన్
తపస్వీ ధర్మనిరతో - కాలనేమి వధోద్యమః।

తా॥ సూర్యుని మ్రింగినవాడు, సర్వశాస్త్రము లెరిగినవాడు, వాయునందనుడు, ప్రతాపశాలి, తపస్సంపన్నుడు, ఎల్లప్పుడు ధర్మము నాచరించువాడు, కాలనేమివధ యత్నము కలవాడు.

శ్లో॥ ఛాయాహర్తా దివ్యదేహో - పావనః పుణ్యకృ చ్ఛివః
లంకాభయప్రదో ధీరో - ముక్తాహార విభూషితః॥

తా॥ ఛాయాగ్రాహియగు రాక్షసిని సంహరించిన వాడు, దివ్యమైన దేహము కలవాడు, పవిత్రుడు, పుణ్యము నాచరించువాడు, మంగళ స్వరూపుడు, లంకకు భయము కల్గించువాడు, ధైర్యసంపన్నుడు, ముత్యాల హారములచే అలంకరింప బడినవాడు.

శ్లో॥ ముక్తిదో భుక్తిద శ్చైవ - శక్తిద శ్శమకరేతి చ
హరి ర్నిరంజనో నిత్యో - సర్వపుణ్య ఫలప్రదః॥

తా॥ ముక్తినిచ్చువాడు, భుక్తినిచ్చువాడు, శక్తినిచ్చువాడు, శమము నొసగువాడు, హరిస్వరూపుడు, దోషరహితుడు, నిత్యుడు, సర్వ పుణ్యముల ఫలితమునిచ్చువాడు,

శ్లో॥ ఇతీదం శ్రీహరేః పుణ్య - నామాష్టోత్తరం శతం
పఠనాత్ శ్రవణా న్మర్త్యః - జీవ న్ముక్తో భవే ద్ధ్రువమ్॥

తా॥ ఇది శ్రీ హనుమంతుని యొక్క పుణ్యప్రదమగు నామములు నూట యెనిమిది. వీనిని చదువుట వలన, వినుటవలన కూడ మనుష్యుడు నిశ్చయముగా జీవన్ముక్తుడగును.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే శ్రీ హనుమదష్టోత్తర
శతనామస్తోత్రం నామ పంచోత్తర సప్తతి తమః పటలః

## షట్సప్తతిః పటలః

# శ్రీ వానరగీతా

శ్రీ పరాశర ఉవాచ :—

శ్లో॥ శృణు మైత్రేయ! విప్రర్షే — స్తోత్రం శ్రీ హనుమత్పరం
కృతం సర్వవానరైశ్చ – శ్రీ వానరగీతాభిదమ్॥

తా॥ శ్రీ పరాశరుల వారిట్లు పల్కిరి. ఓ మైత్రేయ మహామునీ! వానర ప్రముఖులందరిచే చేయబడిన వానరగీత అనుపేరు గల హనుమత్పరమైన స్తోత్రమును వినుము.

శ్లో॥ స్తోత్రం సర్వోత్తమం చైవ – హనుమత్తత్వదర్శనం
సర్వమాయాహరం చైవ – అధి వ్యాధి వినాశనమ్॥

తా। ఈ స్తోత్రము అన్నిటి కంటె ఉత్తమైనది, హనుమ తత్త్వమును ప్రదర్శించునది. సర్వవిధముల మాయలను హరించునది. శారీరక మానసిక రుగ్మతలను తొలగించునది.

శ్లో॥ అగస్త్యేనపురా ప్రోక్తం – సర్వేషాం మునిసన్నిధౌ
ఇంద్రేణ యాచితే నైవ – లోకోపకర ణేచ్ఛయా॥

తా॥ ఇది లోకోపకరణేచ్ఛతో ఇంద్రునిచే అడుగబడినది. మును లందరి సమక్షమున అగస్త్యునిచే చెప్పబడినది.

శ్లో॥ ఇంద్రోథ పరిపప్రచ్ఛ - సత్కృతం మునిపుంగవం
అగస్త్యం చ మహాత్మానం - ఆసీనం చ సుఖాసనే॥

తా॥ ఇంద్రుడు సత్కరింపబడిన మునిశ్రేష్ఠుడు, మహాత్ముడు, సుఖాసనమున కూర్చున్నవాడు నగు అగస్త్యుని ఇట్లడిగెను.

శ్లో॥ దేవదేవ భవాంభోధేః - దుస్తరా త్కలుషేంద్రియాః
జనాః కథం తరంతీహ - తన్మే వద కృపానిధే॥

తా॥ ఓ దేవదేవా! దయామయా! సంసార మహా సముద్రము దాటరానిది. అట్టి దానిని కలుషమగు ఇంద్రియములు కల జనులెట్లు దాట గలరో నాకు చెప్పవలసినది.

శ్రీ అగస్త్య ఉవాచ :—

శ్లో॥ హనూమంతం కృతం స్తోత్రం - వానరై ర్విమలాత్మభిః
పఠన్తి యే సదా మర్త్యాః - తచ్చిత్తా విమలాత్మకాః
తరన్తి భవపాదోథిం -ప్రాప్నువన్తి హరేః పదమ్॥

తా॥ నిష్కల్మష హృదయులగు వానరులచే హనుమంతుని గూర్చి స్తోత్రము చేయబడినది. సన్మనస్సులతో ఆ హనుమంతుని యందు చిత్తమునుంచి ఎల్లప్పుడు ఏ మానవులు ఆ స్తోత్రమును పఠింతురో వారు సంసార మహా సముద్రమును దాటగలరు. హనుమంతుని సన్నిధిని చేరుకొనగలరు.

శ్లో॥ ఆయుః కీర్తి ర్యశ శ్చైవ - లభన్తే నాత్ర సంశయః

తా॥ అట్టివారు చిరాయువును, గొప్ప కీర్తిని పొందగలరు. ఇందు సందేహములేదు.

వ॥ ఓం అస్య శ్రీవానరగీతా స్తోత్ర మంత్రస్య
అగస్త్యభగవాన్ ఋషిః జగతీ చ్ఛందః శ్రీ
హనుమాన్ దేవతా మారుతాత్మజ ఇతి బీజం
అంజనాసూను రితి శక్తిః వాయుపుత్ర ఇతి
కీలకం శ్రీహనుమత్ప్రసాదసిద్ధ్యర్థే వినియోగః॥

ధ్యానం:-

శ్లో॥ వామే జానుని వామజాను మపరం జ్ఞానాఖ్య ముద్రాన్వితం
హృద్దేశే కలయ న్నుతో మునిగణై రధ్యాత్మదత్తేక్షణః
ఆసీనః కదళీవనే మణిమయే బాలార్క-కోటి ప్రభః
ధ్యాయన్ బ్రహ్మ పరం కరోతు మనసా శుద్ధిం హనూమాన్మమ

తా॥ ఎడమచేతిని ఎడమ మోకాలిపై నుంచి రెండవ చేతితో జ్ఞాన ముద్ర పైచి, హృదయ సమీపమున నుంచినట్టి, ముని సమూహముచే నుతింపబడునట్టి, అధ్యాత్మ దృష్టి కలిగినట్టి, అరటితోటయందు మణిమయ పీఠమున కూర్చొని యున్నట్టి, కోటి బాల సూర్యుల కాంతి కలిగినట్టి, పర బ్రహ్మ ధ్యానమున నున్నట్టి హనుమంతుడు నాకు మనశ్శుద్ధిని కలిగించు గాక।

(కొన్ని పాఠములందీ క్రింది శ్లోకమును కలదు.)

శ్లో॥ సంజీవ పర్వతోద్ధార। మనోదుఃఖం నివారయ
ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ॥

తా॥ సంజీవ పర్వతమును ఎత్తినవాడా। నా మనస్సునందలి దుఃఖమును పోగొట్టుము. ఓ మహాబాహూ। అనుగ్రహింపుము. ఓ వానర శ్రేష్ఠా। రక్షింపుము.

శ్రీసుగ్రీవః:-

శ్లో॥ సువర్ణ శైలస్య గవాం చ కోటి
శతస్య కోటే శ్చ శతస్య యచ్ఛ

దానస్య నైవాస్తి సమం ఫలం చ
ధృవం చ తన్మారుతి దర్శనేన॥

తా॥ సుగ్రీవుడు చేసిన స్తోత్రమిది. బంగరు పర్వత శిఖరములు వంద, గోవులు వందకోట్లు దానము చేయుటవలన వచ్చు ఫలముతో సమానమైన దేదియు లేదు. కాని మారుతి దర్శనము వలన తప్పక అంతటి ఫలితము లభించును.

శ్రీగంధమాదనః-

శ్లో॥ హనుమ న్నితి మే స్నానం - హనుమన్నితి మే జపః
హనుమన్నితి మే ధ్యానం - హనుమ త్కీర్తనం సదా॥

తా॥ శ్రీగంధమాదనుడు చేసిన స్తోత్రమిది. హనుమాన్ అనుటయే నాకు పవిత్రమగు స్నానము. హనుమాన్ అనుటయే నా జపము. హనుమాన్ అనుటయే నా ధ్యానము. ఎల్లప్పుడు నాకు కావలసినది హనుమత్కీర్తనమే.

శ్రీసుషేణః -

శ్లో॥ రామభక్త చరితా కథామృతం
వాయుతనయ గుణానుకీర్తనం
రామదాస! తవ పాద సేవనం
సంభవన్తు మమ జన్మ జన్మని॥

తా॥ శ్రీ సుషేణుడు చేసిన స్తోత్రమిది. రామభక్తుడగు హనుమంతుని కథామృతము గ్రోలుట వాయునందనుని గుణములు నుతించుట, ఓ రామదాసా! నీ పాదసేవనములే నాకు జన్మ జన్మల సమకూడునుగాక।

శ్రీ అంగదః-

శ్లో॥ మాతా సువర్చలా దేవీ - పితా మే వాయునందన.
బాంధవా హనుమద్భక్తాః - స్వదేశం భువనత్రయమ్।

తా॥ శ్రీఅంగదుడు చేసిన స్తోత్రమిది. సువర్చాలాదేవియే నా తల్లి. వాయుదేవుని పుత్రుడగు హనుమంతుడే నా తండ్రి. హనుమద్భక్తులే నా బంధువులు. స్వస్థానమే నాకు ముల్లోకములను.

శ్రీనీలః

శ్లో॥ భక్త కల్పతరుం సౌమ్యం - లోకోత్తర గుణాకరం
సువర్చలాపతిం వందే - మారుతిం వరదం సదా॥

తా॥ శ్రీనీలుడు చేసిన స్తోత్రమిది. భక్తులకు కల్పవృక్షమువంటి వాడు, సౌమ్యుడు లోకోత్తర గుణములకు నిలయమైనవాడు, సువర్చలా నాథుడు, వాయుపుత్రుడు, వరము లిచ్చువాడునగు హనుమంతునకు ఎల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్రీగవాక్షః-

శ్లో॥ వాయుపుత్రేణ మహతా - యద్య దుక్తం కరోమి తత్
న జానామి తతో ధర్మం - మద్ధర్మం రక్ష మాం సదా॥

తా॥ శ్రీగవాక్షుడు చేసిన స్తోత్రమిది. మహాత్ముడగు వాయుకుమారుడు ఏది చెప్పిన అది చేయుచున్నాను. అంతకంటె నాకు ధర్మము తెలియదు. ఓ ఆంజనేయా। నన్ను నా ధర్మమును రక్షింపుము.

శ్రీమైందః-

శ్లో॥ సమీరసూతే। సతతం త్వ దాజ్ఞయా
త్వ దంశకః ప్రేరిత మానసేంద్రియః
కరో మ్యహం య చ్ఛ శుభా శుభం ప్రభో।
త్వ త్ప్రీతయే మత్కృత మస్తు త త్సదా॥

తా॥ శ్రీమైంద్రుడు చేసిన స్తోత్రమిది. ఓ వాయుకుమారా। ఎల్లప్పుడు నీ ఆజ్ఞ వలననీ అంశకలవాడును నీచే ప్రేరేపింపబడిన మాన

సేంద్రియము కలవాడున్నపే శుభాశుభ కర్మలనెప్పుడు నాచరించుచుంటినో ఆ నాచేత చేయబడినవన్నియు ఓ ప్రభూ! నీ ప్రీతికొఱకు చేసినవగుగాక!

శ్రీద్వివిదః-

శ్లో॥ రామాదీనాం రణే ఖ్యాతిం దాతుం యో రావణాదికాన్
నావధీ త్స్వయమే వైక స్తం వందే హనుమత్ప్రభుమ్॥

తా॥ శ్రీ ద్వివిదుడు చేసిన స్తోత్రమిది. శ్రీరామచంద్రాదులకు యుద్ధరంగమున కీర్తినిచ్చుటకై తానే రావణాదులను చంపగల్గియు స్వయముగా వారిని చంపక రామాదులకై విడిచిపుచ్చిన హనుమంతునకు నమస్కరించుచున్నాను.

శ్రీశరభః-

శ్లో॥ భౌమస్య వాసరే పూజా - కర్తవ్యా హనుమత్ప్రభోః
భవే త్స శ్శుచి రాయు శ్శ్రీః - పుత్ర మిత్ర కళత్రవాన్॥

తా॥ శ్రీశరభుడు చెప్పిన దీశ్లోకము. మంగళవారమునాడు హనుమత్పూజ గావించవలెను. అట్లు పూజించినవాడు శుచి, ఆయుర్దాయము, సంపద, పుత్ర మిత్ర భార్యాదులు కలవాడగును.

శ్రీగవయః -

శ్లో॥ ఆమిషీకృత మార్తాండం - గోష్పదీకృత సాగరం
తృణీకృత దశగ్రీవం - ఆంజనేయం నమా మ్యహమ్॥

తా॥ శ్రీగవయుడు చెప్పిన శ్లోకమిది. సూర్యుని మాంసపుముక్కగా చేసినవానిని, సముద్రమును ఆవుగిట్టతో నేర్పడిన గుంటమాత్రముగా చేసినవానిని, రావణాసురుని గడ్డిపరకతో సమానముగ చూచినవానిని ఆంజనేయుని గూర్చి నమస్కరించుచున్నాను.

శ్రీప్రహస్తః -

శ్లో॥ ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః
ఆదాయ తే నైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్॥

తా॥ శ్రీప్రహస్తుడు చెప్పుచున్నాడు. సముద్ర జలమును తేలికగా దాటివైచి జానకీదేవియొక్క దుఃఖమును అగ్నిని తీసివైచి దానితో లంకను తగులబెట్టిన ఆంజనేయునకు దోయిలొగ్గి నమస్కరించుచున్నాను.

శ్రీనలః -

శ్లో॥ నమా మ్యహం వాయుజ పాదపంకజం
కరోమి త ద్వాయుజ పూజనం సదా
వదామి వాతాత్మజ నామ మంగళం
స్మరామి వాయోర్భవ కీర్తనం శుభమ్॥

తా॥ శ్రీనలుడు చెప్పిన శ్లోకమిది. వాయుసూనుని పాదపద్మములకు నమస్కరించుచున్నాను. ఆ వాయునందనుని పూజ నెల్లప్పుడు చేయుచున్నాను. వాయుకుమారుని మంగళప్రదమైన నామమును స్మరించుచున్నాను. వాయుసుతుని శుభప్రదమైన కీర్తనను స్మరించుచున్నాను.

శ్రీధర్మకః—

శ్లో॥ స ప్తషష్టి ర్హతాన్ కోటి - వానరాణాం తరస్వినాం
య స్సంజీవనయామాస - తం వందే మారుతాత్మజమ్

తా॥ శ్రీధర్మకుడు చెప్పిన శ్లోకమిది. యుద్ధమున చంపబడిన బలిష్ఠులగు అరువది యేడుకోట్ల వానరులను ఎవరు బ్రతికించిరో అట్టి హనుమంతునకు నమస్కరించుచున్నాను.

శ్రీగజః -

శ్లో॥ తనౌ వాలపాశః పితా పార్వతీశః
స్ఫుర ద్బాహుదండౌ ముఖే వజ్రదంష్ట్రా
సతీ చాంజనా యస్య మాతా తతోఽన్యం
న జానే న జానే న జానే న జానే॥

తా॥ శ్రీగజుడుచెప్పిన శ్లోకమిది. దేహమున ఎవరికి తోక యుండునో; ఎవరికి తండ్రి పార్వతీపతియగు శంకరుడో, ఎవరికి ప్రకాశించు భుజములు, ముఖమున వజ్రాయుధముతో సమానమైన కోర కలవో, ఎవరికి అంజనాదేవి తల్లియో అట్టి వానికంటె ఇతరు లెవ్వరు నాకు తెలియరు, తెలియరు ముమ్మాటికి తెలియరు.

శ్రీఋక్షరజసః—

శ్లో॥ బుద్ధి ర్బలం యశో ధైర్యం – నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ – హనుమ త్స్మరణా ద్భవేత్॥

తా॥ శ్రీ ఋక్షరజసుడు చెప్పిన శ్లోకమిది. బుద్ధి, బలము, కీర్తి, ధైర్యము, భయము లేకుండుట, రోగము లేకుండుట, పీడ లేకుండుట వాక్పటిమ మున్నగున వన్నియు హనుమంతుని స్మరణమువలన లభించును.

శ్రీ సంపాతిః :-

శ్లో॥ సీతా శోకస్య నాశాయ – శ్రీరామే శోకనాశనం
సాధకానాం సుఖం ధన్యం – వాయుసూనుం నమా మ్యహమ్॥

తా॥ శ్రీ సంపాతి చెప్పిన శ్లోకమిది. సీతాదేవి యొక్క దుఃఖమును పోగొట్టినవానిని, శ్రీరాముని దుఃఖమును పోగొట్టువానిని, సాధకు లగువారికి సుఖరూపమైయుండునట్టి ధన్యుడగు హనుమంతుని గూర్చి నేను నమస్కరించుచున్నాను.

శ్రీవేగవాన్

శ్లో॥ అంజనా వరపుత్రాయ - రామేష్టా య హనూమతే
సర్వలోకైక వీరాయ - భవిష్య ద్బ్రహ్మణే నమః॥

తా॥ శ్రీ వేగవంతుడు చెప్పిన శ్లోకమిది. అంజనాదేవి యొక్క ఉత్తమ పుత్రుడు, రామునకు ఇష్టుడు. సర్వలోకములకు ఒకే ఒక్క వీరుడు, రాబోవు యుగముల బ్రహ్మయగు హనుమంతునకు నమస్కారము.

శ్రీరుంధ్రగీవః-

శ్లో॥ హనుమ త్సదృశం దైవం - నాస్తి నాస్తీతి భూతలే
తం పూజయన్తి సతతం - బ్రహ్మ గౌరీ మహేశ్వరాః॥

తా॥ శ్రీరుంధ్రగీవుడు చెప్పిన శ్లోకమిది. హనుమంతునితో సమానమైన దైవమీ భూతలమున లేదు లేదు అని బ్రహ్మ, పార్వతీ పరమేశ్వరాదులందరు ఎల్లప్పుడు ఆ హనుమంతునే పూజించుచున్నారు.

శ్రీ దధిముఖః -

శ్లో॥ ఆలోడ్య వేద శాస్త్రాణి - సర్వా ణ్యపి మహర్షిభిః
ఇద మేకం సునిర్ణీతం - న దైవం హనుమత్పరమ్॥

తా॥ శ్రీదధిముఖుడు చెప్పిన శ్లోకమిది సమస్తములైన వేద శాస్త్రములను పూర్తిగా విమర్శించిన మహర్షులచే ఈ ఒక్క విషయము చక్కగా నిర్ణయింపబడినది. అది ఏమన హనుమంతుని కంటె గొప్పవాడగు దైవము లేదు.

శ్రీ సుదంష్ట్రః -

శ్లో. మంగళం హనుమ న్నిత్యం - మంగళం కపిపుంగవ।
మంగళం చాంజనాసూనో। - మంగళం రాఘవప్రియ॥

తా॥ శ్రీ సుదంష్ట్రుడు చెప్పిన శ్లోకమిది. ఓ హనుమంతా! నిత్యము నీకు మంగళము ఓ వానరశ్రేష్ఠా! నీకు మంగళము. ఓ అంజనా దేవి కుమారుడా! నీకు మంగళము. ఓ రాఘవప్రియా! నీకు నిత్యము మంగళము.

శ్రీ ఋషభః -

శ్లో॥ కరుణారస పూర్ణాయ - జగ దానంద హేతవే
కుక్షిస్థాఖిల లోకాయ - హనూమ ద్బ్రహ్మణే నమః॥

తా॥ శ్రీ ఋషభుడు చెప్పిన శ్లోకమిది. కరుణతో నిండినవాడును, జగత్తున ఆనందకారణమును, సమస్తలోకములు ఉదరమున కలవాడును అగు బ్రహ్మరూపుడైన హనుమంతునకు నమస్కారము.

శ్రీపృథుః-

శ్లో॥ దాతా దాపయితా చైవ - సంవాహాన్ రక్షక స్తథా
ప్రేరక శ్చానుమోదా చ - కర్తా భోక్తా కపీశ్వరః॥

తా॥ శ్రీపృథువు చెప్పిన శ్లోకమిది, ఇచ్చువాడు, ఇప్పించువాడు సేవచేయువారిని రక్షించువాడు, లోకమునకు ప్రేరకుడు, లోకకృత్యముల కనుమోదకుడు, చేయువాడు, అనుభవించువాడు అందఱు హనుమంతుడే. హనుద్భిన్నముగా లోకమందేదియు లేదు.

శ్రీజాంబవాన్ :-

శ్లో॥ భుక్తి ముక్తిప్రదం నామ - విహాయ హనుమన్ తవ
సంసరంతి జనా మూఢాః - కిం విచిత్ర మతఃపరమ్॥

తా॥ శ్రీ జాంబవంతుడు చెప్పిన శ్లోకమిది. ఓ హనుమంతా! భుక్తిని ముక్తిని ప్రసాదించెడి నీ దివ్యమైన నామమును వీడి ఈ మూఢులైన జనులు మరల మరల జన్మలనెత్తుచున్నారు. ఇంతకంటె విచిత్రమేమికలదు?

శ్రీ జ్యోతిర్ముఖః–

శ్లో॥ మత్ప్రార్థనా ఫల మిదం మమ జన్మన శ్చ
నేచ్ఛామి కించి దపరం హనుమన్ ! మహాత్మన్ !
త్వ ద్దాస దాసజన పాద రజోనికేత
మస్మ ద్ధితో భవతు సేవకపారిజాత ॥

తా॥ శ్రీ జ్యోతిర్ముఖుడు చెప్పుచున్నాడు. సేవకుల పాలిటి పారిజాత వృక్షమువంటివాడా! నీ దాసానుదాసులగు వారి పాదరేణువు నాకు హితము గూర్చునదగుగాక! ఓ మహాత్మా ! హనుమంతా ! నా జన్మకు, నిన్నుగూర్చిన ప్రార్థనకు ఫలముగా నేను కోరున దిదియే. ఇంతకుమించి యేమాత్రము కోరను.

శ్రీసుముఖః–

శ్లో॥ రసనే! రససారజ్ఞ మధు రాస్వాద కాంక్షిణి!
హనుమ న్నామ పీయూషం సర్వదా రసనే పిబ॥

తా॥ శ్రీ సుముఖుడు చెప్పిన శ్లోకమిది. రససారము నెరిగి మధురమైన ఆస్వాదనము కాంక్షించు ఓ నాలుకా! నీవెల్లప్పుడు హనుమన్నామామృతమునే త్రాగుము.

శ్రీగోలాంగూలః–

శ్లో॥ కుతో దుర్దినం వా కుతో భౌమవారః
కుతో వై ధృతి స్తస్య భద్రా కథం వా
కుతో వా వ్యతీపాత దోషక్షతం వా
హనూమ త్పదధ్యాన పీతాశుభస్య॥

తా॥ శ్రీగోలాంగూలుడు చెప్పిన శ్లోకమిది. హనుమత్పదధ్యానము ద్వార అశుభములను పోగొట్టుకున్న వానికిక దుర్దినమని యేమున్నది? మంగళ వారమేమునద్ని. వైధృతి యోగం ఎందుకు? శుభముల ఆలోచన

ఎందుకు వ్యతీపాతయోగమెందుకు! దోషసమయమని, తుమ్మినసమయమని దోషశంక ఎందుకు? హనుమత్కార్యము చేయువారేమియు ఆలోచించ పనిలేదు- హనుమద్ధ్యానముననే సర్వ శుభములు కల్గును.

శ్రీకుముదః-

శ్లో॥ త్రాతారో భువి పాదా శ్చ - మార్గా శ్చ రసనే త్వయా
హనుమ న్నిర్మితా స్సన్తి - జనానాం హీనతా కుతః।

తా॥ శ్రీ కుముదుడు చెప్పుచున్నాడు. భక్తజనులను రక్షించగల హనుమంతుని పాదములు ఆరాదించు కొనుటకై భూమిపై నున్నవి. ఓ వాలుకా! నీచేత నిర్మింపబడిన ధ్యానాదికములగు హనుమన్మార్గములు ఉన్నవి. ఇక జనులకు హీనత ఎందుకు? లోటేమున్నది.

శ్రీశతబలిః-

శ్లో॥ ధన్యోఽస్మ్యను గృహీతోఽస్మి పుణ్యోఽస్మి మహతోఽస్మ్యహం
హనుమన్ త్వ త్పదాంభోజ సేవా విభవ యోగతః।

తా॥ శ్రీశతబలి చెప్పిన శ్లోకమిది. ఓ హనుమంతా! నీ పాద పద్మముల సేవయనెడు భాగ్యము లభించుటవలన నేను ధన్యుడనైతిని, అనుగ్రహింపబడిన వాడనైతిని. పుణ్యవంతుడనైతిని. గొప్పవాడనైతిని.

శ్రీకేసరిః –

శ్లో॥ త్వత్తోఽన్యం శరణం నాస్తి - త్వ మేవ మమ రక్షకః
అతో మయి కృపాదృష్ట్యా - హనుమన్ రక్ష మాం సదా॥

తా శ్రీకేసరి చెప్పిన శ్లోకమిది. ఓ హనుమంతా! నీకంటె నాకు వేరొక శరణ్యము లేదు, నీవే నా రక్షకుడవు. కావున నాయందు దయ చూపి ఎల్లప్పుడు నన్ను రక్షింపుము.

శ్రీమారీచః –

శ్లో॥ సదా పాపౌఘ నిఘ్నాతం - పాపేషు హృష్టమానసం
పాపాత్మానం మహాపాపం - రక్ష మాం హనుమత్ప్రభో!

తా॥ శ్రీ మారీచుడు చెప్పిన శ్లోకమిది. ఓ హనుమన్మహాప్రభో ఎల్లప్పుడు పాప సమూహమున త్రోయబడువాడును, పాపము నందే సంతోషించు మనస్సు కలవాడను, పాపాత్ముడను, మహాపాపినినగు నన్ను రక్షింపుము.

శ్రీ తరుణః —

శ్లో॥ హనుమ దాజ్ఞయా యచ్చ - భావి త ద్భవతి ధ్రువం
యదభావి న త ద్భావి - వృధా దేహపరిశ్రమః॥

తా॥ శ్రీ తరుణుడు చెప్పిన శ్లోకమిది. హనుమదాజ్ఞ వలన కానున్నదేది కలదో అది తప్పక జరుగును. ఏది కాదగదో అది కానే కాదు. కావున శరీరముచే పడుపాట్లు వ్యర్థము.

శ్రీగోముఖః —

శ్లో॥ అపరాధ శతం నిత్యం - కుర్వాణం మాం నృశంసకం
క్షమస్వ దాసబుద్ధ్యా త్వం - హనుమన్ కరుణానిధే॥

తా॥ శ్రీ గోముఖుడు చేసిన ప్రార్థన ఇది. ప్రతి దినము వందల కొలది తప్పులు చేయుచు దుర్మార్గుడనై యున్న నన్ను దాసునిగా తలచి కరుణానిధివైన ఓ హనుమంతా! నీవు క్షమించుము.

శ్రీ పనసః —

శ్లో॥ హనుమతో న పరం పరమార్థతో
హనుమతో న పరం పరమార్థతః
ఇతి వదామి జనాన్ పరమార్థతో
న హి పరం భవతా త్ర విచక్షణః॥

తా॥ శ్రీ పనసుడు చెప్పిన శ్లోకమిది. పరమార్థ దృష్టితో చూచిన హనుమంతుని కంటె పరమైనది లేదు. పరమార్థ దృష్ట్యా హనుమంతుని కంటె పరమైనది లేదు అని జనులను గూర్చి పరమార్థ దృష్టితో చెప్పు చున్నాను. ఇందింత కంటె ఆలోచించ వలసినది లేదు.

శ్లో॥ ఇతీదం వానరప్రోక్తం - సర్వపాపహరం పరం
సర్వజ్ఞాన ప్రదం చైవ - సర్వసౌభాగ్య వర్ధనమ్॥

తా॥ అను ఈ వానరులచే చెప్పబడిన స్తోత్రము అన్ని పాపములను తొలగించగలది. సర్వ విధముల జ్ఞానమునిచ్చునది. సర్వ సౌభాగ్యములను పెంపొందించునది.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే శ్రీవానరగీతా నామ
షట్సప్తతితమః పటలః

సప్త సప్తతిః పటలః

## హనుమజ్జయన్తి కథనం

శ్రీ మైత్రేయః -

శ్లో॥ కథం జయంత్యాం హనుమాన్ - పూజనీయః పరాశర!
విధిః కో వా ఫలం కిం వా - కాలః కో వా విశేషతః
త త్సర్వం బ్రూహి భగవన్ - లోకానాం హితకామ్యయా॥

తా॥ శ్రీ మైత్రేయు లడుగుచున్నారు. ఓ పరాశర మహామునీ! హనుమజ్జయంతినాడు హనుమంతుని ఎట్లు పూజింపవలెను? ఏ విధానముతో పూజచేయదగును? విశేషించి ఏ సమయమున కర్తవ్యము? అట్లు జయంతినాటి పూజవలన ఫలితమేమి? లోకముల మేలు కొరకై నాకు ఈ విషయమంతను ఓ మహాత్మా! తెలియ జేయవలసినది.

శ్రీపరాశరః—

శ్లో॥ సాధు సాధు మహాప్రాజ్ఞ! సమ్యక్ప్రశ్నః కృత స్త్వయా
య దుద్ధృతా న్యనేకాని - భువనాని మహామునే!॥

తా॥ శ్రీ పరాశరుల వారు చెప్పుచున్నారు, ఓ మహాజ్ఞానీ! బాగు బాగు. నీవు చక్కని ప్రశ్న వేసితివి. నీ ప్రశ్నవలన ఓ మహామునీ! అనేక లోకములు ఉద్ధరింప బడుచున్నవి.

శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం - దశమ్యాం మందవాసరే
పూర్వాభాద్రాఖ్య నక్షత్రే - ముహూర్తే కర్కటాభిధే
మధ్యాహ్నే వైధృతీయోగే - కుర్యాత్పూజా హనూమతః॥

తా॥ వైశాఖ మాసమున, కృష్ణ పక్షమున, దశమి తిధి యందు, శనివారమున, పూర్వాభాద్రా నక్షత్రమున కర్కాటక లగ్నమున మధ్యాహ్న సమయమున, వైధృతీ యోగమునందు హనుమంతుని పూజ నొనర్చవలెను.

శ్లో॥ గంధ పుష్పాక్షతై ర్దివ్యైః - నైవేద్యై ర్విభవాన్వితైః
నృత్య వాద్యాదిభి స్సమ్య - గర్చనీయో తదా హరిః॥

తా॥ గంధము, పుష్పములు, అక్షతలు మున్నగు వానితోను, వైభవోపేతమై, దివ్యములైన నైవేద్యములతోను, నృత్య వాద్యాది సర్వ ఉపచారములతోను అప్పుడు హనుమంతుని బాగుగా అర్పించవలెను.

శ్లో॥ గోమయే నోపలిప్యాఽథ - భూమిం నిశ్చలమానసః
రంగవల్లీన్ తతః కుర్యా - త్తండులాం స్తత్ర నిక్షిపేత్॥

తా॥ ఆరోజు నిశ్చలమానసుడై ముందుగ ఆ ప్రదేశమంతను పేడతో అలికి పిదప ముగ్గులు పెట్టవలెను. అచ్చట బియ్యము పోయవలెను.

శ్లో॥ పంచాఢక ప్రమాణం వా - ప్రస్థ పంచక మేవ వా
తదర్ధం వా తదర్ధం వా - విత్తశాఠ్యం న కారయేత్॥

తా॥ ఐదు తూముల బియ్యము కాని, లేదా ఐదు ప్రస్థముల ప్రమాణముగా గాని, దానిలో సగముకాని, అంచు సగము కాని బియ్యము పోయవలెను. ధనలోభమున లోపము చేయరాదు.

శ్లో॥ తండులోపరి సంస్థాప్య - సౌవర్ణం కలశం సుధీః
రాజితం వాఽపి తామ్రం వా - మృణ్మయం చాఽపి శక్తితః॥

తా॥ విజ్ఞుడగువాడు ఆ బియ్యముపై సువర్ణ కలశము కాని లేదా వెండి, రాగి అదియును కాకున్న శక్తిననుసరించి మట్టి కలశమునైనను ఉంచవలెను.

శ్లో॥ నవీనం కలశం కుర్యాత్ - నిర్మలోదక పూరితం
ఫలాని చ సుపుష్పాణి - సువర్ణం తత్ర నిక్షిపేత్॥

తా॥ కొత్త కలశము నేర్పరచి దానిని స్వచ్ఛమైన జలముతో నింపవలెను. అందు పండ్లను మంచి పుష్పములను బంగారమును ఆ కలశములో నుంచవలెను.

శ్లో॥ నవాంబరం సుసంశోధ్యాచ్ఛాదయేత్కలశోపరి

తా॥ క్రొత్త వస్త్రమును బాగుగ శుద్ధిచేసి కలశముపైన కప్పవలెను.

శ్లో॥ ప్రతిమా కలశవస్త్రం చ - హోమం బ్రాహ్మణ భోజనం
గురుపూజనం చ కర్తవ్యం - సర్వత్ర హనుమద్వ్రతే

తా॥ హనుమద్విగ్రహము, కలశ వస్త్రము, హోమము, విప్ర సమారాధనము. గురుపూజనము అనునవి హనుమద్వ్రతము నందెల్ల యెడల ఆచరింప దగినవి.

శ్లో॥ యథా శక్తి హిరణ్యేన - తామ్రేణ రజతేన వా
హనుమ ద్విగ్రహం ధీమాన్ - కారయిత్వా ప్రయత్నతః॥

తా॥ శక్తిననుసరించి బంగారముతో కాని, రాగితోకాని, వెండితో కాని బుద్ధిశాలియగు వాడు ప్రయత్న పూర్వకముగా హనుమద్విగ్రహము నొనర్చి.

శ్లో॥ పంచామృతాభిషేకేన - స్నాపయిత్వా కపీశ్వరం
పీతాంబరయుగం వాఽపి - హరిద్రాక్తపటే తు వా।

తా॥ పంచామృతాభిషేకముతో హనుమంతునకు స్నానము చేయించి పచ్చని వస్త్రములు కట్టి వస్త్రము, ఉత్తరీయములకుగా రెంటిని కాని లేదా పసుపు బట్టలను కాని.

శ్లో॥ ధారయిత్వా మహార్హే తు రత్నసింహాసనే శుభే
ప్రచ్ఛాద్య నూతనం వస్త్రం - స్థాపయే న్మారుతాత్మజమ్॥

తా॥ స్వామిచే ధరింపజేసి శుభప్రదమై గొప్పదగు రత్న సింహాసనమున నూతన వస్త్రమును కప్పి వాయునందనుని ఉంచవలెను.

శ్లో॥ ప్రాణప్రతిష్ఠాం కుర్వీత - మూలమంత్ర విధానతః
షోడశా నుపచారాం స్తస్య - తతః కుర్యా ద్యథావిధి॥

తా॥ అనంతరము మూలమంత్ర విధానముతో ప్రాణప్రతిష్ఠ నొనర్చవలెను. అటుపిమ్మట యథావిధిగా షోడశోపచారముల నొనర్చవలెను.

శ్లో॥ సువర్ణకలశై ర్యుక్తం - పూగీఫల సమన్వితం
అర్ఘ్యం దత్వా పంచవారం - పుష్పాక్షత సమన్వితమ్॥

తా॥ సువర్ణకలశముతో ఐదుపర్యాయములు అర్ఘ్యమిచ్చి ఒక్కలతోను, పుష్పాక్షతలతోను

శ్లో॥ సదక్షిణాం చ తాంబూలం - స వస్త్రం ప్రతిమాన్వితం
గురుం సంపూజ్య యత్నేన - వస్త్రాలంకరణాదిభిః
బ్రాహ్మణాయ సుశీలాయ - దానం దద్యా త్కుటుంబినే।

తా॥ దక్షిణతోను కూడిన తాంబూలమును, వస్త్రములతో నున్న హనుమద్విగ్రహమును వస్త్రాలంకరణాదులతో గురువును పూజించి

శీలవంతుడు కుటుంబియు నగు సద్బ్రాహ్మణునకు దానముగా ఈయ వలెను.

శ్లో॥ జయంతీ దివసే పూజాం - కృత్వా శ్రీహనుమత్ప్రభోః
ఉపవాసా యతేః ప్రోక్తాః - గృహిణాం భోజనం మతమ్

తా॥ హనుమజ్జయంతినాడు శ్రీ ఆంజనేయస్వామి పూజనొనర్చి యతులు ఉపవాసమొనర్చవలెను. గృహస్థులకు భోజనము కర్తవ్యము.

శ్లో॥ పూర్వాప్రోష్ఠపదా యుక్తా - జయంతీ దశమీ తిథిః
అత్ర నక్షత్ర వైరూప్యే - తిథి రేవ ప్రయోజకా॥

తా॥ పూర్వాభాద్రా నక్షత్రయుక్తమైన దశమి తిధి జయంతి యగును. నక్షత్రము, తిథివేరు వేరుగా వచ్చినచో అందు తిథినే - ముఖ్యముగా గ్రహించి జయంతిని నిర్ణయింపవలెను.

శ్లో॥ వైశాఖమాసి యత్నేన - కుర్యాత్కార్య మనుత్తమం
అసకృద్వా సకృద్వా తే - పరాంగతి మవాప్నుయాత్॥

తా॥ వైశాఖ మాసమున ప్రయత్న పూర్వకముగా శ్రీ హనుమత్కార్యము నొనర్చవలెను. ఎప్పుడు చేయుటవలన కాని, ఎప్పుడైన చేయుటవలన కాని అట్లు జయంతి నిర్వహించిన వారు ఉత్తమ గతులు పొందగలరు.

శ్లో॥ వైశాఖే మాసి మాహాత్మ్యం - కల్పకోటిశతై రపి
న శక్యం వర్ణితుం బ్రహ్మన్ - బ్రహ్మణోఽపి సమంతతః॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! వైశాఖ మాస మాహాత్మ్యము వంద కోట్ల కల్పములు వర్ణించుటకు బ్రహ్మకు కూడా శక్యముకాదు.

శ్లో॥ యత స్సువర్చలా నాథో - అంజనాగర్భ సంభవః
హనుమాన్ మారుతి శ్శ్రీమాన్ - అవతీర్ణో రిరక్షయా॥

తా॥ ఎందువలనన సువర్చలా ప్రియుడును, అంజనా గర్భ సంభూతుడును, వాయునందనుడునగు శ్రీమంతుడగు హనుమంతుడు లోకముల రక్షించుట కొరకు అనాడవతరించినాడు.

శ్లో॥ తదా ప్రభృతి మాసస్య - వైశాఖస్య మహాత్మనః
స్నాన దానాది యోగ్యత్వం - హనూమ జ్జన్మకారణాత్॥

తా॥ హనుమజ్జన్మ కారణమున అప్పటినుండి గొప్పదగు వైశాఖ మాసమునకు స్నాన దానాది యోగ్యత చేకూరినది.

శ్లో॥ ఇతిత్వనిశ్చిత్య మతిమాన్ - స్నాయా ద్బాహ్యాజలాంతరే
సంతర్పయే త్పితౄ న్తత్ర - దద్యా ద్విప్రాయ గోధనమ్॥

తా॥ అని నిశ్చయించుకొని బుద్ధిమంతుడగువాడు గ్రామము వెలుపల నుండు నదీ తటాకములందు స్నాన మొనర్చవలెను. అచట పితృదేవతలకు తర్పణ లీయవలెను. అందట శ్రోత్రియులకు గోవులను, ధనమును దానము చేయవలెను.

శ్లో॥ దాపయే దుదకం చాన్నం - హనూమ త్ప్రీతయే తథా

తా॥ అరీతిగనే హనుమత్ప్రీతి కొఱకై ఉదకమును. అన్నమును దానము చేయవలెను.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వాఽపి - వైశ్యో వా శూద్ర ఏవ వా
స్త్రీ వా పుమాన్ వా షండో వా - యథాశక్తి నివేదయేత్॥

తా॥ బ్రాహ్మణుడుకాని క్షత్రియుడుకాని వైశ్యుడుకాని శూద్రుడు కాని స్త్రీకాని, పురుషుడుకాని నపుంసకుడుకాని ఎవరైనను యథాశక్తిగా నివేదన మొనర్చవలెను.

శ్లో॥ తత స్తు హనుమాన్ ప్రీతః - దద్యా న్నిజ పదాంతికం
తదా ద్వాదశవారం తు - జుహుయా ద్గోఘృతేన చ॥

తా॥ అందువలన హనుమంతుడు సంతృప్తినంది తన పాదముల చెంతకు చేర్చుకొనును. అప్పుడు పండ్రెండు పర్యాయములు ఆవు నేతితో హోమము చేయవలెను,

శ్లో॥ యథాశక్తి బ్రాహ్మణాం శ్చ – భోజయే దిష్టవస్తుభిః
ఆంజనేయ ప్రసాదేన - సర్వా న్కామా నవాప్నుయాత్॥

తా॥ యథాశక్తిగా శ్రోత్రియులకు ఇష్టమైన పదార్థములతో భోజనము పెట్టవలెను. శ్రీ ఆంజనేయుని అనుగ్రహమువలన కోరికలన్నియు నెరవేరును.

శ్లో॥ రత్నసింహాసనం తత్ర - హైమం భాస్కరసన్నిభం
ని స్తాంత స్తమ స్తోమం - కల్పయే న్మునిపుంగవ॥

తా॥ ఓ మైత్రేయా! బంగారముతో చేసినట్టి, సూర్యునితో సమానమై మనసునందలి అంధకారమును గూడ తొలగింపజాలిన రత్న సింహాసనమును నిర్మింపవలెను.

శ్లో॥ ఆవాహయే ద్ధనూమ న్తం - రత్నసింహాసనే సుధీః
అథ ధ్యాయే త్కపిశ్రేష్ఠం - చతురావరణాన్వితమ్॥

తా॥ విజ్ఞుడగువాడు ఆ రత్నసింహాసనమున హనుమంతునకు ఆవాహన మొనర్చవలెను. పిమ్మట చతురావరణ యుతుడగు వానర శ్రేష్ఠుని ధ్యాన మొనర్పవలెను.

శ్లో॥ వామభాగే స్థితాం పత్నీం - సూర్యపుత్రీం సువర్చలాం
పశ్య న్తం స్నిగ్ధయా దృష్ట్యా - స్మితయుక్త ముఖాంబుజామ్॥

తా॥ ఎడమభాగమున నుండి చిరునగవొలుకు ముఖపద్మముగలదై యున్న తన భార్యయు సూర్యుని పుత్రికయు అగు సువర్చలాదేవిని ప్రేమతో చూచునట్టి హనుమంతుని ధ్యాన మొనర్పవలెను.

శ్లో॥ ఛత్ర చామర సంయుక్తం - నీలాద్యై శ్చ సుసేవితం
ముక్తాహార గణోపేతం - రత్నకుండల భూషితమ్॥

తా॥ ఛత్ర చామరములు కలవానిని, నీలాదులతో సేవింపబడు వానిని ముత్యాల హారములను ధరించిన వానిని, రత్నకుండలములు అలంకరించిన వానిని

శ్లో॥ గ్రైవేయ భూషిత గ్రీవం - కనకాంబర ధారిణం
నానా మణి సముత్కీర్ణ కిరీటోజ్జ్వల శేఖరమ్॥

తా॥ కంఠహారముచే నలంకరింపబడిన కంఠము కలవానిని బంగరు వస్త్రమును ధరించినవానిని, అనేక మణులు పొదిగిన కిరీటముతో ప్రకాశించు శిరస్సు కలవానిని

శ్లో॥ మేఖలాదామ సంవీతం - మణినూపుర శోభితం
రత్నకంకణ విద్యోత - పాణౌ రక్తాంబుజ ద్వయమ్॥

తా॥ మొలత్రాడు చుట్టుకొనిన వానిని, మణులు పొదిగిన అందెలు ధరించిన వానిని, రత్న కంకణములతో ప్రకాశించు చేతులందు రెండు ఎఱ్ఱ తామరలు కలవానిని

శ్లో॥ క్వథిత స్వర్ణవర్ణాంగ ముష్ట్రధ్వజ సమన్వితం
చతుర్భుజధరం శాంతం — సర్వవ్యాపిన మీశ్వరమ్॥

తా॥ పుటముపెట్టిన బంగారపు చాయగల అవయవములు కలవానిని, ఒంటె టెక్కెముగా కలవానిని, నాల్గు భుజములు కలవానిని, శాంతస్వరూపుని, అంతట వ్యాపించి యుండువానిని సర్వాధికుని ధ్యానమొనర్చుచున్నాను. అని ధ్యానము చేయవలెను.

శ్రీసువర్చలా హనుమతే నమః ధ్యాయామి-ధ్యానం సమర్పయామి.

శ్లో॥ సర్వదేవ పరీవారం - సర్వాభీష్ట ఫలప్రదం
ఆవాహయామి సర్వేశం - సూర్యపుత్రీ ప్రియం ప్రభుమ్॥

తా॥ దేవతలందరను పరివారముగాకల్గినట్టి, కోరిన కోర్కెలన్నిటిని తీర్చునట్టి, అంజనాతనయుడైనట్టి, మాయకతీతుడై జగత్తునకు

గురుస్థానీయుడైన సువర్చలాపతియు సర్వ సమర్థుడు అయిన దేవుని ఆంజనేయుని ఆవాహనమొనర్చుచున్నాను.

శ్రీ సువర్చలాహనుమతేనమః ఆవాహయామి ఆవాహనం సమర్పయామి

శ్లో॥ దేవదేవ జగన్నాథ! - కేసరీ ప్రియనందన!
రత్నసింహాసనం తుభ్యం - దాస్యామి హనుమత్ప్రభో॥

శ్రీసువర్చలాహనుమతేనమః రత్నఖచితసింహాసనం సమర్పయామి

తా॥ దేవదేవా! జగత్పతీ! ఓ కేసరియొక్క ప్రియసుతుడా హనుమత్ప్రభూ! నీకు రత్న సింహాసనమును సమర్పించుచున్నాను.

శ్లో॥ యోగిధ్యే యాంఘ్రిపద్మాయ - జగతాం పతయే నమః
పాద్యం మయార్పితం దేవ! గృహాణ పురుషోత్తమ

శ్రీ సువర్చలా హనుమతేనమః పాదయోః పాద్యం సమర్పయామి

తా॥ యోగులు ధ్యానముచే చేయదగు పాదపద్మములు కల జగన్నాథుడైన హనుమంతునకు నమస్కారము. ఓ పురుషోత్తమా! దేవా! నేను సమర్పించెడి పాద్యమును స్వీకరింపుము.

శ్లో॥ లక్ష్మణప్రాణ సంరక్ష - సీతాశోక వినాశక!
గృహాణార్ఘ్యం మయా దత్తం - పార్వతీ ప్రియనందన!॥

శ్రీ సువర్చలా హనూమతేనమః - హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

తా॥ లక్ష్మణుని ప్రాణముల రక్షించినవాడా! సీతాదేవియొక్క దుఃఖమును పోగొట్టినవాడా! పార్వతీనందనా! నాచే ఈయబడు అర్ఘ్యమును స్వీకరింపుము.

శ్లో॥ వాలాగ్ర సేతుబంధాయ - దశానన వధాయ చ
తుభ్య మాచమనం దత్తం - ప్రతిగృహ్ణీష్వ మారుతే!

శ్రీసువర్చలా హనుమతేనమః ఆచమనీయం సమర్పయామి

తా॥ వాలాగ్రముచే సేతువు బంధించినట్టి దశగ్రీవుని సంహరించినట్టి వాయునందనా! నీకు ఆచమనం సమర్పించితిని. స్వీకరింపుము.

శ్లో॥ అర్జునధ్వజ సంవాస। దశానన మదాపహ।
మధుపర్కం ప్రదాస్యామి హనుమ న్ప్రతిగృహ్యతామ్॥
శ్రీసువర్చలా హనుమతేనమః మధుపర్కం సమర్పయామి

తా॥ అర్జునుని ధ్వజముపై నున్నవాడా। రావణుని మదమునణచిన వాడా। హనుమంతా। మధుపర్కమునిచ్చుచున్నాను. స్వీకరింపుము.

శ్లో॥ గంగాది సర్వతీర్థేభ్య స్సమానీతై ర్నవోదకైః
భవంతం స్నాపయిష్యామి - కపినాయక గృహ్యతామ్॥
శ్రీసువర్చలా హనుమతేనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

తా॥ గంగానది మున్నగు సర్వ తీర్థములనుండి తీసికొని వచ్చిన నూతన జలములతో నిన్ను స్నానము చేయించుచున్నాను. ఓ వానర నాయకా గ్రహింపుము.

శ్లో॥ పీతాంబర మిదం తుభ్యం - తప్త హాటక సన్నిభం
దాస్యామి వానర శ్రేష్ఠ। సంగృహాణ నమోఽస్తు తే॥
శ్రీసువర్చలా హనుమతేనమః వస్త్రయుగ్మం సమర్పయామి

తా॥ పుటము పెట్టిన బంగారముతో సమానమై పచ్చగనున్న వస్త్రములను సమర్పించుచున్నాను. ఓ వానర శ్రేష్ఠా। స్వీకరింపుము. నీకు నమస్కారము.

శ్లో॥ బ్రహ్మసూత్ర మిదం భవ్యం - ముక్తాదా మోపశోభితం
స్వీకరుష్వాంజనీపుత్ర । భక్త రక్షణ తత్పర॥
శ్రీసువర్చలా హనుమతేనమః యజ్ఞోపవీతం సమర్పయామి

తా॥ ముత్యాలహారమువలె ప్రకాశించునట్టి శుభప్రదమైన బ్రహ్మ సూత్రమిదిగో। అంజనీ కుమారా। భక్తులను రక్షించుటలో తత్పరత కలవాడా। స్వీకరింపుము.

శ్లో॥ ఉత్తరీయం తు దాస్యామి - సంసారోత్తారకారణ।
గృహాణ పరమప్రీత్యా - నతోఽస్మి తవ పాదయోః॥

శ్రీసువర్చలా హనుమతేనమః ఉత్తరీయం సమర్పయామి

తా॥ సంసారమునుండి ఉద్ధరించువాడా! నీకు ఉత్తరీయమును సమర్పించుచున్నాను. నీపాదములకు నమస్కరించుచున్నాను. పరమ ప్రీతితో దీనిని స్వీకరింపుము.

శ్లో॥ భూషణాని మహార్హాణి - కిరీటప్రముఖా న్యహం
తుభ్యం దాస్యామి సర్వేశ! - గృహాణ కపినాయక!

శ్రీసువర్చలా హనుమతేనమః ఆభరణాని సమర్పయామి

తా॥ సర్వేశా! గొప్పవిలువ కల కిరీటము మున్నగు భూషణములను నీకు సమర్పించుచున్నాను. ఓ వానరవీరా! స్వీకరింపుము.

శ్లో॥ కస్తూరీ కుంకుమోన్మిశ్రం - కర్పూరాగురు వాసితం
శ్రీచందనం మ దాస్యామి -గృహ్యతాం హనుమత్ప్రభో॥

శ్రీసువర్చలా హనుమతేనమః దివ్యశ్రీ చందనం సమర్పయామి

తా॥ కస్తూరి, కుంకుమ పువ్వులు కలిసినది కర్పూరము, అగరులతో మిళితమైనది అగు చందనమును సమర్పించుచున్నాను. ఓ హనుమత్ప్రభూ! స్వీకరింపుము.

శ్లో॥ సుగంధీని సురూపాణి - వన్యాని వివిధాని చ
చంపకాదీని పుష్పాణి - కమలా న్యుత్పలాని చ

తా॥ మంచివాసనలుకల్గి. మంచిరూపములుకల్గి తోటలయందు పూచిన వివిధములగు చంపకాది పుష్పములను, కమలములను, కలువలను

శ్లో॥ తులసీదళ బిల్వాని - మనసా కల్పయామి తే
గృహాణ హనుమ న్దేవ! - ప్రణతోఽస్మి పదాంబుజే॥
శ్రీసువర్చలా హనుమతే నమః పుష్పాణి సమర్పయామి

తా॥ తులసీదళములను, మారేడుదళములను నీకు మనస్ఫూర్తిగ సమర్పించుచున్నాను నీ పాద పద్మములకు నమస్కారము. దేవా! ఓ హనుమంతా! వానిని స్వీకరింపుము.

శ్లో॥ శాలీయా నక్షతా న్రమ్యాన్ - పద్మరాగసమ ప్రభాన్
అంఖడాన్ ఖండితధ్వాంతః స్వీకురుష్వ దయానిదే॥
శ్రీసువర్చలాహనుమతే నమః అక్షతాన్ సమర్పయామి

తా। అజ్ఞానాంధకారమును తొలగించువాడా! రమ్యములై, పద్మ రాగములతో సమానమైన కాంతిగలవై విరుగని శాలిధాన్యపు అక్షతలను సమర్పించు చున్నాను ఓ దయానిధీ! స్వీకరింపుము.

శ్లో॥ కపిలాఘృత సంయుక్తం - కృష్ణాగురు సముద్భవం
మయా సమర్పితం ధూపం - హనుమన్ ప్రతిగృహ్యతామ్॥
శ్రీసువర్చలాహనుమతే నమః - ధూప మాఘ్రాపయామి.

తా. కపిలగోవు నేతితో కూడినది, కృష్ణాగురుతో తయారుచేసి నదియగు ధూపమును సమర్పించుచున్నాను. ఓ హనుమంతా స్వీక రింపుము.

శ్లో॥ నిరస్తాజ్ఞాన తిమిర! తేజోరాశే! జగత్పతే!
దీపం గృహాణ దేవేశ! గోఘృతాక్తం దశాన్వితమ్॥
శ్రీసువర్చలాహనుమతే నమః - దీపం దర్శయామి.

తా॥ అజ్ఞానాంధకారమును తొలగించినవాడా! తేజః పుంజమా! జగన్నాథా! ఆవునేతితో తడుపబడిన వత్తికల దీపమిదిగో! ఓ దేవదేవా! స్వీకరింపుము.

శ్లో॥ ఇదం దివ్యాన్న మమృతం - సూప శాక ఫలాన్వితం
సాజ్యం సదధి సక్షీరం - శర్కరా మధు సంయుతమ్॥

తా॥ ఇది పప్పు, కూరలు, పండ్లు మున్నగువానితోను, నేయి, పెరుగు, పాలు, పంచదార, తేనె మున్నగు వానితోను కూడిన అమృత సమమగు దివ్యాన్నము.

శ్లో॥ భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ - చోష్యం చాపి చతుర్విధం
గృహాణ హనుమ న్భక్త్యా - స్వర్ణపాత్రే నివేదితమ్॥
శ్రీసువర్చలాహనుమతే నమః - మహానైవేద్యం సమర్పయామి

తా॥ పిండివంటలు, తినదగిన ఇతర పదార్థములు, నాకదగినవి, పీల్చదగినవి యను నాలువిధములైన పదార్థములను బంగరు పాత్రయందు భక్తితో సమర్పించుచున్నాను. ఓ హనుమంతా! స్వీకరింపుము.

శ్లో॥ సమర్పయామి పానీయం - మధ్యే మధ్యే సుధోపమం
సచ్చిదానంద రూపాయ - సృష్టి స్థిత్యంత హేతవే॥
శ్రీసువర్చలాహనుమతే నమః మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.

తా॥ సచ్చిదానందరూపునకు, సృష్టిస్థితి లయలకు కారకునకు నీకు మధ్య మధ్య అమృత సమమైన పానీయమును సమర్పించుచున్నాను.

శ్లో॥ పూగీఫల సమాయుక్తం - కర్పూరాది సమన్వితం
స్వర్ణవర్ణ దళోపేతం - తాంబూలం గృహ్యతాం హరే!
శ్రీసువర్చలాహనుమతే నమః తాంబూలం సమర్పయామి

తా మంచి పోకలతోకూడినదియు, కర్పూరాదులతో కూడినదియు, బంగరు వంటి లేత ఆకులతో కూడిన తాంబూలమును సమర్పించు చున్నాను. ఓ ఆంజనేయా! స్వీకరింపుము.

శ్లో॥ నీరాజన మిదం దివ్యం - మంగళార్థం కపిప్రభో!
మయా సమర్పితం తాత! గృహాణ వరదో భవ॥
శ్రీసువర్చలాహనుమతే నమః కర్పూరనీరాజనం సమర్పయామి

తా॥ మంగళసిద్ధికై దివ్యమగు నీరాజన మిచ్చుచున్నాను. ఓ వానరవీరా! దీనిని స్వీకరింపుము. నాకు వరముల ననుగ్రహింపుము.

శ్లో॥ నృత్యం గీతం చ వాద్యం చ - కృతం గంధర్వసత్తమైః
ప్రకల్పయామి మనసా - సుప్రీతో వరదో భవ॥
శ్రీసువర్చలాహనుమతే నమః నృత్య గీత వాద్యాని సమర్పయామి

తా॥ గంధర్వశ్రేష్ఠులచే చేయబడిన నృత్యగీత వాద్యములను మనసా కల్పించుచున్నాను. వానిచే తృప్తుడవై వరముల నొసగుము.

శ్లో॥ మందార పారిజాతాది - పుష్పాంజలి మిమం ప్రభో।
సర్వపుష్ప సమాకీర్ణ - ముష్ట్రిధ్వజ గృహాణ వై॥

శ్రీసువర్చలాహనుమతే నమః-సువర్ణదివ్యమంత్రపుష్పం సమర్పయామి.

తా॥ ఓ స్వామీ। మందారము, పారిజాతము మున్నగు వానితో బంగారు పూవులతో కూడిన పుష్పాంజలిని సమర్పించుచున్నాను. ఒంటె ధ్వజమున కలవాడా। స్వీకరింపుము.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారాన్ - సాష్టాంగాన్ పంచసంఖ్యయా
దాస్యామి కపినాథాయ - గృహాణాభీష్టదాయక ।॥

శ్రీసువర్చలాహనుమతే నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

తా కపినాయకా। నీకు ఐదుప్రదక్షిణములను, ఐదు సాష్టాగం నమస్కారములను సమర్పించుచున్నాను. కోరిన కోరికల దీర్చువాడా। స్వీకరింపుము.

శ్లో। దేవదేవ। జగన్నాథ। పురాణ పురుషోత్తమ।
అనేన పూజావిధినా - సుప్రీతో వరదో భవ॥

తా॥ దేవదేవా। జగత్పతీ। పురాణ పురుషోత్తమా। ఈ నా పూజ వలన సంతోషించిన వాడవై నాకు వరములను ప్రసాదింపుము.

శ్లో॥ అంత్యే దద్యా త్ప్రసన్నార్ఘ్యాన్ - యథా పూర్వ వినిర్మితాన్

తా॥ పూజాంతమున పూర్వమిచ్చిన రీతిగనే ప్రసన్నార్ఘ్యముల నైదు పర్యాయము లీయవలెను.

1. శ్లో॥ దశమ్యాం మందయుక్తాయాం కృష్ణాయాం మాసి మాధవే
పూర్వభాద్రాఖ్య నక్షత్రే - వైధృతౌ హనుమా నభూత్॥

శ్రీసువర్చలా సమేత హనుమతే నమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ వైశాఖమాసమున కృష్ణపక్షమున దశమి తిథియందు శని వారమున పూర్వాభాద్రా నక్షత్రమున వైధృతియోగమున హనుమంతు డవతరించెను.

2. శ్లో॥ దుష్టానాం శిక్షణార్థాయ – శిష్టానాం రక్షణాయ చ
శ్రీరామస్వామి కార్యార్థం – జాత శ్రీహనుమాన్ హరిః॥
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ దుష్టులను శిక్షించుట కొఱకు మంచివారిని రక్షించుట కొఱకు శ్రీరామచంద్రుని సేవకై వానర శ్రేష్ఠుడగు శ్రీ హనుమంతుడు జన్మించెను.

3. శ్లో॥ అంజనాగర్భ సంభూత! హనుమన్! పవనాత్మజ!
గృహాణార్ఘ్యం మయా దత్తం కపివర్య నమోస్తు తే।
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ అంజనాదేవి గర్భమున జనించినవాడా! వాయునందనా! హనుమంతా! నేను సమర్పించు అర్ఘ్యమును స్వీకరింపుము. ఓ కపినాయకా! నీకు నమస్కారము.

4. శ్లో॥ వధార్థం రక్షసాం జాత హనుమాన్ భక్తవత్సల
గృహాణార్ఘ్యం మయాదత్తం కపివర్య నమోఽస్తు తే।
శ్రీసువర్చలాసమేత హనుమతే నమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ రాక్షసులను వధించుట కొఱకు పుట్టినవాడా! భక్తవత్సలుడా! హనుమంతా! నాచే సమర్పింపబడిన అర్ఘ్యమును స్వీకరింపుము. ఓ వానర శ్రేష్ఠా! నీకు నమస్కారము.

శ్లో॥ జాతః కపికులాంభోధౌ – స్వర్ణరంభా వనాశ్రయః
భక్త సంరక్షణ స్వామిన్ – గృహాణార్ఘ్యం నమోఽస్తు తే॥
శ్రీసువర్చలాసమేత హనుమతే నమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ నీవు కపికులమున జనించినవాడా? బంగరు అరటితోటలందు వసించువాడా! భక్తులను రక్షించువాడా! స్వామీ అర్ఘ్యమును స్వీకరింపుము. ఓ హనుమంతా! నీకు నమస్కారము,

ఇతి శ్రీపరాశర సంహితాయాం పరాశర మైత్రేయసంవాదే
శ్రీపంచముఖ హనుమన్మంత్ర వివరణే
హనుమజ్జయన్తికథనం నామ సప్తసప్తతిః పటలః సమాప్తః

## అష్టసప్తతిః పటలః

# కవచ యంత్ర ప్రభావ కథనం

శ్రీపరాశరః-

శ్లో॥ పార్వత్యై శంకరేణోక్తం - కవచం తు మహాద్భుతం
అత్యాదరేణ విప్రేంద్ర! - ప్రోక్తం లోకహితాయ వై॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! పూర్వము శంకరునిచే పార్వతీదేవికి లోక హితార్థము గొప్ప మేలు కల్గించెడి కవచము ఆదరముతో చెప్పబడినది.

పార్వత్యువాచ :-

శ్లో॥ దేవదేవ! జగన్నాథ! సర్వభూత వశంకర?
కేన రక్షా భవేన్నౄణాం - భీతానాం వివిధాపదైః॥

తా॥ పార్వతిదేవి పల్కుచున్నది. ఓ దేవదేవా! జగద్రక్షకా! సర్వభూతములు వశమైయున్నవాడా! అనేక ఆపదల వలన భీతిచెంది యున్న మనుష్యులకు దేనివలన రక్షకలదో తెలియజేయవలసినది.

శ్లో॥ మంగళం చ మహాపుణ్యం - పవిత్రం పాపనాశనం
శ్రోతుమిచ్ఛామి దేవేశ! - వద మే కరుణాకర!॥

తా॥ మంగళప్రదమైనది, పుణ్యప్రదమైనది, పవిత్రమైనది, పాపముల నణచునది యగు దానిని వినగోరుచున్నాను. ఓ దేవదేవా ! దయామయా ! నాకు చెప్పవలసినది.

ఈశ్వర ఉవాచ:-

శ్లో॥ శృణు గుహ్యతమం దేవి ! భక్తామయ వినాశకమ్॥

తా॥ ఓ దేవి ! పార్వతీ ! భక్తుల రోగములనన్నిటిని పోగొట్టజాలినది, రహస్యమైనదియగు కవచమును చెప్పుచున్నాను. వినవలసినది.

[గమనిక:- వ్రాతప్రతులు లభ్యముకాని కారణమున ఈ పటలమును సంపూర్ణముగా ఈయలేకపోవుచున్నాము. లభ్యముకాగనే అనంతర గ్రంథము ద్వారా అందించగలము. ఈ కవచమెవ్వరికయిన లభించన మాకు పంపవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.]

ఇట్లు
గ్రంథకర్త
ప్రకాశకులు.

ఏకోనాశీతిః పటలః

## హనుమత్స్తోత్ర రూపనామ కథనం

శ్రీపరాశరః-

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - శృణుష్వ మునిపుంగవ!
పార్వత్యై శంకరేణోక్తం - మంత్రం తు సుమహాద్భుతమ్॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మునిశ్రేష్ఠా! పార్వతీదేవికి శంకరునిచే చెప్పబడిన వేరొక విశేషమైన మహాద్భుతమగు మంత్రమును చెప్పుచున్నాను. వినవలసినది.

ఈశ్వరః

శ్లో॥ పార్వతి! శృణు చాన్యత్ర మాలామంత్ర మనుత్తమం
హనుమ త్సంహితాయాం చ మంత్రరాజ మిదం శుభమ్
ప్రతాపహనుమ న్మాలా మనుః ప్రకటపరాక్రమః॥

తా॥ ఈశ్వరుడు చెప్పుచున్నాడు. ఓ పార్వతీ! హనుమన్మంత్ర సమూహమున రాజువంటిదై ఉత్తమము శుభప్రదము అగు వేరొక మంత్రమును చెప్పుచున్నాను వినవలసినది. స్పష్టమగు శక్తిగల అది ప్రతాపహనుమన్మాలా మంత్రము.

శ్లో॥ యో జపే చ్చ ఇమం మంత్రం - భక్త్యా శుద్ధేంద్రియ శ్శుచిః
తస్యా నిలాత్మజో నిత్యం - పుత్రవ ద్దృశ్యతే ధ్రువమ్॥

తా। ఈ మంత్రమును భక్తితోను, పరిశుద్ధమనస్సుతోను, శౌచముతోను ఎవరు జపింతురో వారిని నిశ్చయముగ హనుమంతుడు పుత్రుని వలె చూచును.

శ్లో॥ మాతృకాబిందుసహితా అనులోమ విలోమికా
వర్గాష్టక సుసంయుక్తా - అష్టోత్తర శతాఖ్యకా॥

తా॥ మాతృకాబిందు సహితమై అనులోమ విలోమ విధానములు కల్గి వర్గాష్టకముతో కూడి అష్టోత్తర శతమని చెప్పబడునదై

శ్లో॥ అక్షమాలా భవ -మంత్రాణాం క్షిప్రసిద్ధిదా
కవచం మూలమంత్రం చ సంస్తవం మంగళాత్మకమ్॥

తా॥ అక్షమాయుతముగ జపించుట వలన మంత్రములు వెంటనే సిద్ధించును. కవచము, మూలమంత్రము మంగళాత్మకగు స్తోత్రము

శ్లో॥ యంత్ర మేత త్సమాయుక్తం త్రిలోకా నపి సాధయేత్
నాతః పరతరం కించిత్ మంత్రసిద్ధిషు శస్యతే॥

తా॥ కవాచాదులతో యంత్రముతోను కూడిన మంత్రము ముల్లోకములను సాధించును. మంత్రసిద్ధియందు ఈ లిఖి మించి వేరేదియు లేదు.

శ్లో॥ రోగోపశమనం శత్రుక్షయకరం వాదవిజయం
అనేన మంత్రరాజేన - శీఘ్రం మర్త్యో విజేయతే॥

తా॥ రోగములు పోగొట్టుట, శత్రువుల నాశనము గావించుట వాదములందు జయించుట ఇట్టి వానియందు ఈ మంత్రమువలన వెంటనే మనుష్యుడు విజయమందును.

శ్లో॥ విష్ణుభక్తస్తు యో మర్త్యో - జపేన్మంత్ర మనుత్తమం
మోక్షవిజ్ఞానసిద్ధిస్తు తస్య హస్తతలే స్థితా॥

తా॥ విష్ణుభక్తుడగు ఏమనుష్యుడు ఈ ఉత్తమమగు మంత్రమును జపించునో వానికి మోక్షజ్ఞానసిద్ధి అరచేతియందే యుండును.

శ్లో॥ బహునాత్ర కి ముక్తేన - శృణు ష్వైక మనుత్తమం
సర్వసౌభాగ్యదం భద్రం - భక్తానాం శృణు పార్వతి॥

తా॥ పెక్కు మాటలేల? ఏకాగ్రతతో వినుము. ఓ పార్వతీ ఈ మంత్రము భక్తులకు సర్వ సౌభాగ్యముల నిచ్చునది. మంగళప్రద మైనదనియు.

పార్వత్యువాచ-

శ్లో॥ అజ్ఞానహారి దేవేశ - చంద్రశేఖర! శంకర!
స్తోత్రరూపాణి నామాని - హర! మే బ్రూహి విస్తరాత్॥

తా॥ పార్వతీదేవి చెప్పుచున్నది. అజ్ఞానమును పోగొట్టెడి దేవ దేవా! చంద్రశేఖరా శంకరా! హరా! స్తోత్రరూపములగు నామములను నాకు సవిస్తరముగా చెప్పవలసినది.

ఈశ్వరః-

శ్లో॥ శృణు హైమవతీ దుర్గే - జగన్మాత ర్మమ ప్రియేతే!

తా॥ ఈశ్వరుడు చెప్పుచున్నాడు. ఓ హైమవతీ! దుర్గా! లోకమునకు తల్లివైనదానా! నా కిష్టురాలా! నామములను వినుము.

శ్లో॥ అంజనేయాయ వీరాయ — శివాయ విపులౌజసే
రమ్య దేహాయ ఘోరాయ - మర్కటాయ మహాత్మనే॥

తా॥ ఆంజనేయునకు నమస్కారము. వీరునకు నమస్కారము. రమ్యమగు దేహము కలవానికి నమస్కారము. ఘోరరూపునకు నమస్కారము, మర్కటరూపునకు నమస్కారము. మహాత్మునకు నమస్కారము.

శ్లో॥ రామదూతాయ దైత్యారి వర్ధనాయ నమో నమః
వాయుపుత్రాయ జ్వాలాయ - నమః కాలాగ్ని రుద్రాయ

తా॥ రామదూతకు నమస్కారము. దేవతల రక్షించు వానికి నమస్కారము. వాయుపుత్రునకు నమస్కారము. జ్వాలారూపునకు నమస్కారము. కాలాగ్ని రుద్రునకు నమస్కారము.

శ్లో॥ వాలినే చా నమ స్తుభ్యం - కుమారబ్రహ్మచారిణే
చల త్కుండల గండాయ - దండితాయాఽశివాయ చ॥

తా॥ వాలముకల నీకు నమస్కారము. కుమారబ్రహ్మచారికి నమస్కారము. కదలెడి కుండలములు కల గండస్థలములుకల వానికి నమస్కారము. అమంగళములను హరించు వానికి నమస్కారము.

శ్లో॥ పుండరీక నిభేక్షాయ — రామభక్తాయ తే నమః
అరూపాయ సురూపాయ - అణురూపాయ తే నమః

తా॥ తెల్లదామరలతో సమానమైన కండ్లు కలవానికి నమస్కారము. రామభక్తుడవగు నీకు నమస్కారము. రూపరహితుడవగు నీకు నమస్కారము. సురూపుడవగునీకు నమస్కారము, అణురూపుడవగు నీకు నమస్కారము.

శ్లో॥ విరూపాయ సరూపాయ - కామరూపాయ తే నమః
మహద్రూపాయ శక్తయే - నక్తంచరహరాయ చ॥

తా॥ విరూపునకు నమస్కారము. సరూపునకు నమస్కారము. కామరూపుడవగు నీకు నమస్కారము. మహద్రూపునకు నమస్కారము. శక్తిస్వరూపునకు నమస్కారము. రాక్షసుల సంహరించువానికి నమస్కారము.

శ్లో॥ భుక్తి ముక్తి ప్రదాయాశు - ముక్తదోషాయ తే నమః
వజ్రరూపాయ దేవాయ - వాలాస్త్రాయ తు తే నమః॥

తా॥ భుక్తిని, ముక్తిని ఇచ్చు వానికి నమస్కారము. శీఘ్రముగ దోషముల వదలువానికి నమస్కారము. వజ్రరూపునకు నమస్కారము. దేవునకు నమస్కారము. వాలమే అస్త్రముగా కల నీకు నమస్కారము.

శ్లో॥ వజ్రదంష్ట్రాయ రౌద్రాయ - నమో రుద్రసుతాయ చ
బ్రహ్మతేజాయ తేజాయ- భవిష్య ద్బ్రహ్మణే నమః॥

తా॥ వజ్రాయుధమువంటి కోరలు కలవానికి నమస్కారము. రౌద్రమూర్తికి నమస్కారము. రుద్రసుతునకు నమస్కారము. బ్రహ్మతేజునకు నమస్కారము. తేజోమూర్తికి నమస్కారము. భవిష్ద్బ్రహ్మకు నమస్కారము.

శ్లో॥ నమో దోర్దండ చండాయ- బ్రహ్మాస్త్ర స్తంభనాయ చ
సీతాదుఃఖ వినాశాయ - సుగ్రీవసచివాయ చ।

తా॥ బాహుదండములతో తీవ్రరూపము కలవానికి నమస్కారము. బ్రహ్మాస్త్ర స్తంభనునకు నమస్కారము. జానకి దుఃఖము పోగొట్టినవానికి నమస్కారము. సుగ్రీవుని మంత్రికి నమస్కారము.

శ్లో॥ పంచవక్త్రాయ ఆక్రాంత లోకాలోకాయ తే నమః
నమ స్త్రిమూర్తిరూపాయ - నమోఽబ్ధిలంఘనాయ చ॥

తా॥ పంచముఖునకు నమస్కారము. ఆక్రమింపబడిన లోకముల దయచూచు నీకు నమస్కారము. త్రిమూర్తిరూపునకు నమస్కారము. సముద్రమును లంఘించిన వానికి నమస్కారము.

శ్లో॥ రామపాదాంబుజ క్రీడా - సక్త మానసవృత్తయే
స్వర్ణవర్ణాయ పూర్ణాయ - పూర్ణచంద్ర నిభాయ చ॥

తా॥ శ్రీరాముని పాదపద్మములయందు క్రీడించుటలో ఆసక్తిగల మానసవృత్తి కలవానికి నమస్కారము. బంగరు ఛాయకలవానికి నమస్కారము. పూర్ణరూపునకు నమస్కారము. పూర్ణచంద్రునితో సమానుడగు వానికి నమస్కారము.

శ్లో॥ అజ్ఞానార్ణవ నావాయ - ఆపదుద్ధారకాయ చ
కబళీకృత మిత్రాయ - కల్యాణ గుణశాలినే॥

తా॥ అజ్ఞాన సముద్రమునకు నావయైన వానికి నమస్కారము. ఆపదలనుండి ఉద్ధరించువానికి నమస్కారము. సూర్యుని కబళించిన వానికి నమస్కారము. శుభప్రదమగు గుణములు కలవానికి నమస్కారము

శ్లో॥ భక్త్యాఽనురక్తచిత్తాయ భవరోగ హరాయ చ
భోగ భాగ్య ప్రదా యాథ - రామదాసాయ తే నమః॥

తా॥ భక్తితో అనురక్తమైన చిత్తము కలవానికి నమస్కారము. సంసార బంధమను రోగమును హరించు వానికి నమస్కారము, భోగ భాగ్యములిచ్చువానికి నమస్కారము. రామసేవకుడగు నీకు నమస్కారము.

శ్లో॥ సుదూరీకృత దౌష్ట్యాయ - త్రైలోక్యగీత కీర్తయే
నమః కృపా సేవధయే - చాతురీనిధయే నమః॥

తా॥ దౌష్ట్యమును దూరమొనర్చినవానికి నమస్కారము. ముల్లోకములచే కొనియాడబడు కీర్తి కలవానికి నమస్కారము. దయాపూర్ణునకు నమస్కారము. చాతుర్యపు నిధికలవానికి నమస్కారము.

శ్లో॥ పారధ్వజనివాసాయ - ప్రార్థితాఽఖిలలోకినే
భక్త్యోధ్యాన వసంతాయ -శత్రుదావ దహాయ చ॥

తా॥ అర్జునధ్వజము నివాసముగా కలవానికి నమస్కారము. లోకములన్నిటిచే ప్రార్థింపబడువానికి నమస్కారము. భక్తులనెడు ఉద్యాన వనమునకు వసంతమైనవానికి నమస్కారము. శత్రువుల పాలిటి దావాగ్నియైన వానికి నమస్కారము.

శ్లో॥ అక్షరాయ అనంతాయ – అచ్యుతాయాఽరిహారిణే
దశకంఠ మహాదర్ప – దళనాయ నమో నమః॥

తా॥ నాశనరహితునకు నమస్కారము. అంతములేని వానికి నమస్కారము. చ్యుతిలేనివానికి నమస్కారము. రావణాసురుని గర్వ మణచిన వానికి నమస్కారము.

శ్లో॥ ముద్రాపహారిణే తుభ్యం – రామాజ్ఞాకారిణే నమః
లంకాపురీ విదాహాయ – లంకిణీభంజనాయ చ॥

తా॥ రామముద్రను గొంపోయినవానికి నమస్కారము. శ్రీరామాజ్ఞ నాచరించన వానిక నమస్కారము. లంకా పట్టణమును తగులబెట్టిన వానికి నమస్కారము, లంకిణిని సంహరించినవానికి నమస్కారము.

శ్లో॥ లంకాలంకార సంహర్త్రే – శ్రీమహాకపయే నమః
చర్మకౌపీన వాసాయ – లస న్మౌంజీధరాయ చ।

తా॥ లంకకు అలంకారమైన లంకిణిని సంహరించిన వానికి నమస్కారము. శ్రీమహాకపిరూపునకు నమస్కారము. చర్మముతో నిర్మించిన కౌపీనమును ధరించినవానికి నమస్కారము. ప్రకాశించు ముంజత్రాటిని ధరించినవానికి నమస్కారము.

శ్లో॥ రామపాదాబ్జ భృంగాయ– పింగాక్షాయ తు తే నమః
లస ద్యజ్ఞోపవీతాయ – కుండలాలంకృతాయ చ॥

తా॥ శ్రీరామపాదపద్మమున తుమ్మెదయైన వానికి నమస్కారము. పింగళవర్ణపు నేత్రములు కలవానికి నమస్కారము. ప్రకాశించు జందెము కలవానికి నమస్కారము. కుండలములచే నలంకరింపబడువానికి నమస్కారము.

శ్లో॥ తులసీదళ దామాయ - తుంగోత్తుంగభుజాయ చ
నఖాయుధాయ ధీరాయ - నవ్యతేజాయ తే నమః॥

తా॥ తులసీదళముల మాలకలవానికి నమస్కారము. ఎత్తైన భుజములు కలవానికి నమస్కారము. గోళ్ళు ఆయుధములుగా కలవానికి నమస్కారము. ధైర్యశాలియగు వానికి నమస్కారము. నవ్యమగు తేజస్సుకల నీకు నమస్కారము.

శ్లో॥ మందారసుమ దామాయ - నమ స్సుందరమూర్తయే
విష్ణుభక్తాయ శ్రేష్టాయ - బ్రహ్మజ్ఞానిని యోగినే॥

తా॥ మందారపూవుల మాలిక కలవానికి నమస్కారము. సుందరమగు రూపముకలవానికి నమస్కారము. విష్ణుభక్తునకు నమస్కారము. శ్రేష్ఠునకు నమస్కారము. బ్రహ్మజ్ఞానియగు వానికి నమస్కారము. యోగియగువానికి నమస్కారము.

శ్లో॥ త్యాగినే రాగిణే తుభ్యం - రమ్యదేహాయ తే నమః
అంగదాయ నమ స్తుభ్యం - సంగరాహిత హారిణే॥

తా॥ త్యాగియగు వానికి నమస్కారము. అనురాగవంతుడవగు నీకు నమస్కారము. రమ్యముకల దేహముకల నీకు నమస్కారము. బాహుపురికలనీకు నమస్కారము. యుద్ధమున శత్రువులను సంహరించు నీకు నమస్కారము.

శ్లో॥ దివ్యమంగళ దేహాయ - మంగళాకారిణే నమః
శత్రుమాంగళ్య సంహర్త్రే - సుగ్రీవాయ నమో నమః
నమః ప్లవగరూపాయ - శ్రీరామప్రియతే నమః॥

తా॥ దివ్యమంగళమగు దేహము కలవానికి నమస్కారము. మంగళాకారముకల నీకు నమస్కారము. శత్రువులభార్యల మాంగల్యములను హరించువానికి నమస్కారము. మంచిమెడ కలవానికి నమ

స్కారము. వానరరూపముకల వానికి నమస్కారము. శ్రీరాముని కిష్టుడ వైన నీకు నమస్కారము.

శ్లో॥ ఇత్యష్టోత్తర నామాని - యః పఠే ద్భక్తిభావితః
న పుమాన్ శ్రియ మాప్నోతి - పురుషార్థం చతుర్విధమ్॥

తా॥ అను ఈ అష్టోత్తర శతనామములను భక్తి భావముతో ఎవరు పఠింతురో వారు సంపదలను, చతుర్విధ పురుషార్థములను పొందుదురు.

శ్లో॥ దీవ్య త్కుండల కర్ణ మండిత లస ద్గండం హరిం వాయుజం
చండాంశు ప్రతిభాసమాన రుచిరం శత్రుప్రహారం సదా
నానారత్న విభూషితోజ్జ్వల మహా ముక్తాసరై ర్భూషితం
ధ్యాయేత్ శ్రీరఘురామ దూత మనిశం శాంతం హనూమత్ప్రభుమ్॥

తా॥ ప్రకాశమానమగు కుండలములు కల చెవులతో విరాజిల్లు గండస్థలము కలవానిని, వానరరూపుని, వాయుసుతుని, తీక్ష్ణమైన కిరణములతో ప్రకాశించు కాంతి కలవానిని, శత్రువుల నెల్లప్పుడు నాశనము నర్చువానిని, వివిధములగు రత్నములతో గొప్పదగు ముత్యాల హారములతో నలంకరింపబడిన వానిని శాంతరూపుని, శ్రీరామచంద్రుని దూతయగు హనుమంతుని ధ్యానము చేయవలెను.

శ్లో॥ దివ్య యజ్ఞోపవీతాఢ్యం - రత్నకుండల మండితం
లస న్మౌంజీయుతం దేవం - హేమకౌపీన ధారిణమ్॥

తా॥ దివ్యమగు యజ్ఞోపవీతముతో విలసిల్లు వానిని, రత్నములు పొదిగిన కుండలములతో ప్రకాశించు వానిని, ప్రకాశించు ముంజత్రాడు కలవానిని, దేవుని బంగారుగోచిని ధరించిన వానిని

శ్లో॥ అంజనాతనయం ధీరం - వాయుపుత్రం సముజ్జ్వలం
రామదూతం చ రుద్రాంశం - కేసరీ ప్రియనందనమ్॥

తా॥ అంజనాసుతుని, ధీరుని, వాయుపుత్రుని, ప్రకాశమానుని, రామసేవకుని, రుద్రాంశ సముద్భవుని, కేసరియొక్క ప్రియసుతుని

శ్లో॥ అక్షఘ్నామితతేజాఢ్యం - యక్ష రాక్షస సంహారం
దక్ష మిందీవరాక్షం చ - రామదూతం నమా మ్యహమ్॥

తా॥ అక్షరాక్షసుని చంపిన అమిత తేజస్సుకల వానిని, యక్షరాక్షసుల సంహారించిన వానిని, సమర్థుని, తుమ్మెదలవంటి కండ్లుకల వానిని, రామదూతయగు హనుమంతుని నమస్కరించు చున్నాను.

శ్లో॥ వాలాగ్రేణ నిబద్ధ రాక్షసచమూం వాక్యేన రామప్రభుం
భక్తా నక్షయ భోగ భాగ్య పురుషార్థప్రాప కాశీఃపదైః
ధ్యాయంతం తవ దాసదాస మనిశం మాం రక్ష రక్షేతి చ
ధ్యాయే త్వం రఘువీరభక్త మభయం చిద్రూపిణం మారుతిమ్॥

తా॥ తోకకొనతోనే రాక్షస సేననంతను కట్టివైచిన వానిని, తన వాక్యములతో రాముని బంధించ గలిగిన వానిని, భక్తులను అక్షయములగు భోగ భాగ్యాది పురుషార్థములిడు ఆశీస్సులతో బంధించిన వానిని, నీ దాసానుదాసుడనగు నన్ను రక్షింపుము రక్షింపుమని రాముని ధ్యానించు వానిని, రఘురాముని భక్తుని, అభయుని, జ్ఞానరూపుడగు హనుమంతుని ధ్యానము చేయవలెను.

శ్లో॥ కశ్చిద్రామస్య భృత్యః కపికులప్రవరః కశ్చి దాఢ్య శ్చ వీరః
కశ్చి త్పుత్ర శ్చ దూతః జలరుహనయనః కశ్చి దాపత్సు మంత్రీ
ఏవం నిత్యం సుసత్యే సకలవిచరతః సత్యవాదీ సువాదీ
వాలీ మాలీ సుపాలీ పరమభయకరో వానరః పాతు న స్సః॥

తా॥ ఒకానొక రామసేవకుడు, వానర వంశమున శ్రేష్ఠుడు, గొప్పవాడు, పరాక్రమశాలి, ప్రభంజననందనుడు, రామదూత, పద్మముల వంటి కళ్ళు కలవాడు. ఆపదలయందు మంత్రాంగ మాచరించువాడు అయి ఎల్లప్పుడు సత్యమునందే అంతట ప్రవర్తించువాడై సత్యమునే మాటాడువాడై వాదనైపుణ్యము కలవాడైన వాలము ధరించిన వాడును,

మాలను ధరించిన వాడును, మిక్కిలి భయంకరుడును అగు హనుమంతుడు మమ్ములను రక్షించుగాక!

శ్లో॥ ఇతి స్తుత్వా హనూమంతం - పూజాం కుర్యా త్ప్రయత్నతః
స ఏవ వ్రజతే కామ్యాన్ - నాత్ర కార్యా విచారణా॥

తా॥ అని హనుమంతుని స్తుతించి ప్రయత్న పూర్వకముగా పూజనొనర్ప వలెను. అట్టివాడు తన కోరికలను పొంద గలుగును. ఇందు సందేహింపబనిలేదు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
హనుత్స్తోత్రరూపనామ కథనం నామ
ఏకోనాశీతిః పటలః

అశీతిః పటలః

# సంతాన హనుమన్మంత్ర ప్రభావాస్త్ర ప్రయోగ కథనం

శ్రీపరాశరః:—

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - లోకానా ముపకారకం
సంతాన హనుమన్మంత్రం - శృణుష్వ మునిపుంగవ॥
యస్య స్మరణ మాత్రేణ - సంతాపం ప్రాప్నుయా ద్భవు॥

తా॥ శ్రీ పరాశరుల వారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయ మహా మునీ! లోకోపకారకమగు మఱియొక విశేషమును సంతాన హనుమన్మంత్ర మను దానిని చెప్పుచున్నాము. వినవలసినది. ఆ మంత్రమును స్మరించిన మాత్రముననే సంతానము కల్గును.

శ్లో॥ సారా త్సారతమం మంత్రం - మంగాళానాం చ మంగళం
మంత్రే ణానేన సహసా - బహవ స్సిద్ధి మాప్నుయుః॥

తా॥ ఈ మంత్రము సారవంతమగు వానిలోకెల్ల సారవంత మైనది. మంగళ ప్రదములన్నిటికంటె మంగళప్రదమైనది. ఈ మంత్రము ననుష్ఠించిన వెంటనే అనేకులు తమ కోరికలనందగల్గిరి.

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి - సర్వమంత్ర విశారద

తా॥ ఓ సర్వ మంత్రముల నెరిగినవాడా! సంతాన హనుమన్మంత్ర మును చెప్పుచున్నాను.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - శ్రీబీజం తదనంతరం
మాయాబీజం తథోచ్చార్య - హనుమన్పద ముచ్చరేత్
మమతనయ పదం పశ్చా - ద్దేహి దేహీతి సంవదేత్
వహ్నిజాయాం సముచ్చార్య - వింశద్వర్ణో మను స్మృతః॥

తా॥ ముందు ఓంకారము నుచ్చరించి అనంతరము 'శ్రీం' బీజము నుంచి పిమ్మట హ్రీం క్లీం బీజములనుచెప్పి 'హనుమన్' అని ఉచ్చరించి 'మమతనయం' అనునది చెప్పిన పిదప 'దేహిదేహి' అని, 'స్వాహా' చెప్పవలెను. ఇట్లు మంత్రము ఉండవలెనని మూలము కంటె భిన్న ముగా మంత్రము కానవచ్చుచున్నది. అక్షర సంఖ్యతో ఈ రెండు మత ములు సంబంధించుట లేదు. ఇది ఇరువది యక్షరముల మంత్రముగా చెప్పబడినది.

శ్లో॥ సర్వ సౌభాగ్య జనకం - మంత్రాణా ముత్తమోత్తమం

తా॥ ఈ మంత్రము సర్వసౌభాగ్యముల నిచ్చునది, మంత్రము లన్నిట శ్రేష్ఠమైనది.

గ॥ అస్యశ్రీ సంతానహనుమ న్మంత్రస్య బ్రహ్మ ఋషిః
గాయత్రీ ఛందః శ్రీసంతాన హనుమాన్ దేవతా:

ఓం బీజం; స్వాహా శక్తిః; శ్రీం కీలకం; మమ
సంతాన హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః॥
మూలమంత్రేణ న్యాసం కుర్యాత్॥

తా॥ ఈ సంతానహనుమన్మంత్రమునకు ఋషిబ్రహ్మ. ఛందస్సు గాయత్రీ ఛందస్సు. శ్రీసంతాన హనుమంతుడే దేవత, ఓం బీజము, స్వాహాశక్తి. శ్రీంకీలకము. మమసంతాన హనుమత్ప్రసాద సిద్ధ్యర్థేజపే వినియోగః అని చెప్పవలెను. మూలమంత్రముతోనే అంగన్యాస కరన్యాసములు నొనర్చవలెను.

ధ్యానం:—

శ్లో॥ అంజనాసుత। దేవేశ। కేసరీ ప్రియనందన।
దేహి మే తనయం శీఘ్రం - సర్వభాగ్యనిధిం ప్రభో॥

తా॥ ఓ అంజనాదేవి పుత్రుడా। దేవతలకు నాయకుడా। కేసరికి ప్రియసుతుడా। ఓ ప్రభూ। సర్వసంపదలకు నిలయుడగు పుత్రుని నాకు వెంటనే ప్రసాదింపుము.

శ్లో॥ ప్రాలేయ ద్యుతి బింబ కోటి రుచిర ప్రస్పర్ధి దేహప్రభం
భాస్వ ద్రత్నకిరీట కుండల మణి వ్యాకీర్ణ గండస్థలం
వామే వ్యాధిభి రౌషధం నిగళభిన్నం తత్కరే దక్షిణే
బిభ్రాణం హనుమంత ముజ్జ్వల తటిత్కోటిప్రభం సంశ్రయే॥

తా॥ మంచువలె స్వచ్ఛమగు కాంతికల్గి కోటి సూర్యబింబములతో పోటీపడు దేహకాంతి కలవాడును. ప్రకాశమానమగు రత్నకిరీటము యొక్క, కుండలములందలి మణులయొక్కయు కాంతి వ్యాపించిన చెక్కిలి కలవాడును, ఎడమచేతియందు వ్యాధుల పోగొట్టజాలిన సంజీవి పర్వతము కలవాడును, కుడిచేతియందు సంకెలల ఛేదింపజాలిన ఆయుధ శక్తిని ధరించినవాడును, ప్రకాశమానమగు కోటి మెఱపు కాంతి కలవాడగు హనుమంతుని ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ పురశ్చర్యాక్రమం వక్ష్యే - పంచిలక్షం ద్విజోత్తమః
నారికే ళోధకేనాఽపి - గోక్షీరేణ విశేషతః
గుడోదకేన యోగీంద్రః - దశాశం తర్పయే ద్బుధః॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! దీని పురశ్చర్యా విధానమును చెప్పు చున్నాను. ఐదు లక్షలతో మంత్ర పురశ్చర్య గావింపవలెను. కొబ్బరి కాయ నీటితోకాని, విశేషించి ఆవుపాలతో కాని, బెల్లపు పానకముతో కాని ఆ మంత్ర జపమొనర్చిన దానిలో పదవవంతు తర్పణము గావింప వలెను.

శ్లో॥ త ద్దశాంశం హునే ద్విద్వాన్ - సదా జపపరాయణః

తా॥ తర్పణ సంఖ్యలో పదవవంతు విద్వాంసుడై ఎల్లప్పుడు జపము గావించుచున్న ఆతడు హోమము గావింపవలెను.

శ్లో॥ ఖర్జూరఫల సంయుక్తం - ఇక్షుఖండ మధుత్రయం
పుత్రజీ వ్యాఖ్య బీజాని - ఘృత శర్కర సంయుతమ్
పరమాన్నం చ విప్రేంద్రః - హోమం కుర్యా ద్విచక్షణః॥

తా॥ జ్ఞానియగు జాపకుడు ఖర్జూర పండ్లతోను, చెఱకు ముక్కల తోను, తేనె, పాలు, పంచదారలతోను, పుత్రజీవి విత్తనములతోను, నేయి, పంచదార కల పరమాన్నముతోను ఓ మైత్రేయా! హోమము గావింపవలెను.

శ్లో॥ బ్రాహ్మణా న్భోజయే త్పశ్చాత్ - త ద్దశాంశం క్రమేణ వై॥

తా॥ అనంతరము హోమములో పదవ వంతు సంఖ్య శ్రోత్రియు లకు అన్నదానము గావింపవలెను.

శ్లో॥ పుత్రజీ వ్యక్షమాలాభిః - జపం కుర్యా చ్చ బుద్ధిమాన్
ఏవం యః కురుతే యోగీ - సంతానం ప్రాప్నుయా ద్ద్రుహం॥

తా॥ బుద్ధిమంతుడగు జాపకుడు పుత్రజీవి గింజలతో చేసిన జపమాలికతో జపము గావింపవలెను. చిత్తవృత్తి నిరోధము గావించి ఎవరిట్లు గావింతురో వారికి బహుసంతానము కలుగును.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - శృణు మైత్రేయ! తత్త్వతః
అస్త్రసంజ్ఞాం ప్రవక్ష్యామి - లోకానా ముపకారకమ్॥
యస్య విజ్ఞానమాత్రేణ - సర్వసిద్ధి ర్భవే న్నృణామ్॥

తా॥ ఓ మైత్రేయా! వేరొక విశేషమును చెప్పుచున్నాను. లోకముల కుపకారకమైన అస్త్రమును చెప్పుచున్నాను. వినవలసినది. దీనిని తెలిసికొనుట వలననే మనుష్యులకు సర్వము సిద్ధించును.

శ్లో॥ భూత ప్రేత పిశాచాది - గ్రహపీడా నివృత్తయే
అస్త్రప్రయోగం కుర్వీత - ప్రయోగజ్ఞాన తత్పరః।

తా॥ భూత ప్రేత పిశాచ గ్రహాదుల పీడ తొలగించుకొనుటకు ప్రయోగమెరిగినవాడై అస్త్రప్రయోగము నొనర్చవలెను.

శ్లో॥ న దేయం భక్తిరహితే - న దేయం క్రూరకర్మణి
గురుభక్తి విహీనాయ - న దేయం పాపకర్మణి॥
అనాచారాయ పాపాయ - న దేయం అస్త్ర ముత్తమమ్॥

తా॥ భక్తిలేనివారికీ యస్త్రమునీయరాదు. క్రూరకర్మ నాచరించు వారికై ఈ అస్త్రము నీయరాదు. గురుభక్తి లేనివారికీ యస్త్రము నీయరాదు. పాపకర్మ నాచరించు వారికీ యస్త్రము నీయరాదు. ఈ ఉత్తమమగు అస్త్రమును ఆచారహీనునకు, పాపియగు వానికి ఈయరాదు.

శ్లో॥ అస్త్రోద్ధారం ప్రవక్ష్యామి - పురశ్చర్యావిధిం తథా
ప్రయోగవిధి మాచక్షే - సాంతవ చ్ఛృణు యోగిరాటే॥

తా॥ ఓ యోగివర్యా అస్త్రోద్ధారమును. పురశ్చర్యావిధిని, అస్త్రప్రయోగ విధానమును చెప్పుచున్నాను. సంపూర్ణముగ వినుము.

శ్లో॥ తారాఽంకుశం మహామాయా - శక్తి వారాహ మేవ చ
పంచమీ బీజయుగ్మం చ - వాయు బీజద్వయం తథా॥

తా॥ ఓంకారము పల్కి అంకుశ బీజముపై మహామాయా బీజ మగు ఈంకారము చెప్పి లం అను శక్తి బీజమును, గ్లౌం అను వారాహ బీజము చెప్పవలెను. పంచమ బీజమును రెండుసార్లు చెప్పి వాయు బీజ మును రెండుసార్లు యం యం అని చెప్పవలెను.

శ్లో॥ మధ్యే సాధ్యం చ సంయోజ్యం వాయుబీజద్వయం లిఖేత్
వారాహబీజ యుగ్మం చ - శక్తి వారాహ మేవ చ॥

తా॥ మధ్యమున సాధ్యనామముంచి యం యం అని రెండు వాయు బీజములను వ్రాయవలెను. గ్లౌంగ్లౌం అని రెండు వారాహ బీజముల నుంచి లం అను శక్తి బీజమును వారాహ బీజమును చెప్పవలెను.

శ్లో॥ మాయా పాశం తథా తారం - మంత్ర మేవం సముద్ధరేత్
షోడశాక్ష ర్యాఖ్య రిపు - ఉగ్రాస్త్రం శీఘ్రసిద్ధిదమ్॥

తా॥ ఇం అను మాయా బీజమును, ఆం అనుపాశ బీజమును చెప్పి ప్రణవముతో మంత్రోద్ధారముగా తెలియవలెను. షోడశాక్షరిగా చెప్పబడునిది. శత్రువునకు భయంకరమైనది, శీఘ్రముగా సిద్ధించునదియు నగు అస్త్రము.

శ్లో॥ బ్రహ్మ ఋషి శ్చ చందోఽస్య - గాయత్రీ సముదాహృతం
దేవతా అంజనాపుత్రో - శత్రుమారణ తత్పరః॥

తా॥ ఈ అస్త్రమునకు ఋషి బ్రహ్మ. గాయత్రి ఛందస్సుగా చెప్పబడినది. శత్రువులను నాశనమొనర్చుటలో తత్పరుడైన శ్రీ ఆంజ నేయుడు దేవత.

శ్లో॥ యం బీజం గ్లౌం చ శక్తి స్స్యా - ద్ధుంకారం కీలకం తథా
వినా యోగం చోగ్రకర్మ - కలౌ చైవ మునీశ్వరః
ధ్యానా దేవ కలౌ మర్త్యః - సర్వసిద్ధిం ప్రయచ్ఛతి॥

తా॥ ఈ అస్త్రమునకు యం బీజము. గ్లాం శక్తి. హాం కీలకము. ఉగ్రకర్మల యోగముతో కలియుగమున పనిలేదు. ఓ మైత్రేయ మహా మునీ! ఈ కలియుగమున మనుజుడు ధ్యానము వలనన సర్వసిద్ధి నంద గలడు.

ధ్యానం :-

శ్లో॥ అత్యుగ్రం ఊర్ధ్వకేశం అరికుల భయదం ఖాద దంష్ట్రాగ్రోష్ఠం
ఉద్యద్బాలార్క వర్ణం రవి శశి నయనం కోటిసూర్య ప్రకాశం
మౌంజీ కౌపీన యుక్తం ఘనధరణిధరం పాణినా ధారయంతం
ధ్యాయే దుగ్రాస్త్రరూపం ఉరుతర మనఘం చాంజనేయం కపీశమ్॥

తా॥ మిక్కిలి భయంకరుడైన వాడును, ఊర్ధ్వముగ వ్యాపించిన కేశపాశము గలవాడును, శత్రువులకు భయము కలిగించువాడును, కోరలతో క్రింది పెదవి కలవాడును, పైకిలేచు బాలసూర్యుని కాంతి కల వాడును, సూర్యచంద్రులు కన్నులుగా కలవాడును, కోటి సూర్యుల కాంతి కలవాడును, ముంజత్రాడు, గోచియు ధరించిన వాడును, గొప్పదగు పర్వతమును చేతియందు ధరించి యున్నవాడును, గొప్పవాడును భయంకర మగు అస్త్రరూపుడు వానరశ్రేష్ఠుడగు హనుమంతుని ధ్యానము చేయ వలెను.

శ్లో॥ పురశ్చర్యా మకృత్వా తు - కార్యాదాహో చ్చ పాతకీ
ప్రయోగా నాచరే త్సోఽపి - ఉన్మాదీ జాయతే ధృవమ్
తస్మా త్సర్వప్రయత్నేన - పురశ్చర్యాం సమాచరేత్॥

తా॥ పురశ్చర్య లేకుండగనే కార్యదాహముతో ఏ పాపాత్ముడు అస్త్రప్రయోగము నొనర్చునో అట్టివాడు నిశ్చయముగా పిచ్చివాడగును. కావున సర్వప్రయత్నములతో పురశ్చర్య తప్పక కావింపవలెను.

శ్లో॥ పురశ్చరణ కర్మేషు - అసమర్థో భవే ద్యది
గ్రహణాఖ్య పురశ్చర్యాం - వక్ష్యేఽహం మునిపుంగవ॥

తా॥ పురశ్చర్య యందసమర్థుడైనచో అట్టివానికై గ్రహణ పురశ్చర్యను చెప్పుచున్నాను. ఓ మునిశ్రేష్ఠా! తెలిసికొనదగినది.

శ్లో॥ గ్రహణే సూర్యసోమస్య – పూర్వాహ్ణే సముపోషితః
నద్యాం సముద్రగామిన్యాం – నాభిమాత్రజలే స్థితః॥

తా॥ సూర్యగ్రహణము నందును, చంద్రగ్రహణము నందును పూర్వాహ్ణమున ఉపవసించి సముద్రము వైపు పారు నదియందు బొడ్డులోతు నీటిలో నిలిచినవాడై

శ్లో॥ స్పర్శకాలాదితః జప్య – మోక్షకాలావధి స్తథా
దశాంశం తర్పయే త్తస్య – తద్దశాంశం హునే ద్ఘృతైః॥

తా॥ గ్రహణమున స్పర్శకాలము నుండి మోక్షకాలము వరకు జపించి అందు పదవ వంతు తర్పణము గావించి అందు పదవవంతు నేతితో హోమము చేయవలెను.

శ్లో॥ శతం వాఽర్థశతం చైవ – బ్రాహ్మణా న్భోజయే న్మునే!
తోషయే చ్చ గురుం చాత్మ – విత్తశాఠ్యం న కారయేత్॥
మంత్రసిద్ధి మవాప్నోతి – నాత్ర కార్య విచారణా॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! అనంతరము వందమందికి కాని ఏబది మందికి కాని శ్రోత్రియులకు అన్నసమారాధనము గావింపవలెను. తన గురువును సంతోషపరచవలెను. ఇట్టివానియందు ధనలోభమును చూపరాదు. అట్లు మంత్రసిద్ధియగును. అనుమానించ పనిలేదు.

శ్లో॥ ఏవం సిద్ధమను ర్మంత్రీ – ప్రయోగా నాచరే త్తతః
ప్రయోగానంతరం చైవ – భోజయే ద్బ్రాహ్మణాన్ తతః

తా॥ ఇట్లు మంత్రసిద్ధియైన పిదప మంత్రవేత్త అస్త్రప్రయోగము నాచరింపవలెను. ప్రయోగానంతరము శ్రోత్రియులకు సమారాధన మొనర్చవలెను.

శ్లో॥ అథవాఽన్య ప్రకారేణ - పురశ్చరణ మిష్యతే
గ్రహణాదిషు మోక్షాంతం - జపే న్మంత్రం సమాహితః॥

తా॥ లేకున్న వేరొక విధముగా పురశ్చరణము నొనర్పదగును. గ్రహణాదులందు విడుపు సమయము వరకు పట్టుదలతో మంత్రమును జపింపవలెను.

శ్లో॥ అనంతరం తద్దశాంశం - క్రమా ద్ధోమాదికం చరేత్
తత శ్చ మంత్రసిద్ధి స్స్యాత్ - దేవతా చ ప్రసీదతి॥

తా॥ పిదప అందు పదవ వంతు హోమము నాచరింపవలెను. అంతట మంత్రము సిద్ధించి దేవత అనుగ్రహించును.

శ్లో॥ అథవా దేవతా రూప గురుం భక్త్యా ప్రపూజయేత్
పురశ్చరణ హీనోఽపి - మంత్రసిద్ధి ర్న సంశయః॥

తా॥ అట్లు కాకున్న దేవతారూపుడగు గురువును భక్తితో పూజింపవలెను. ఆ రీతిగా పురశ్చరణ లేకున్నను నిస్సందేహముగా మంత్రసిద్ధి యగును.

శ్లో॥ ఏవం సాధిత మంత్రం తు - కామ్యకర్మాణి సాధయేత్
గురువిశ్వాస హీనాయ - రహస్యం న ప్రకాశయేత్
తస్మా త్సర్వప్రయత్నేన - దేయం కృత్వా పరీక్షణమ్॥

తా॥ ఇట్లు సాధింపబడిన మంత్రము కామ్యకర్మముల సాధింపవలెను. గురుభక్తి లేనివానికి రహస్యమగు మంత్రము చెప్పరాదు. కావున సర్వవిధముల ప్రయత్నపూర్వకముగా పరీక్షించియే మంత్రము నీయవలెను.

శ్రీపరాశరః-

శ్లో॥ దిగ్బంధనం ప్రవక్ష్యామి - ఉగ్రా_స్తస్య మునీశ్వర !
గ్రహపీడా నివృత్త్యర్థం - సావధానమనా శ్శృణు॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓమైత్రేయ మహామునీ! ఉగ్రాస్త్రముయొక్క దిగ్బంధనము చెప్పుచున్నాను. గ్రహపీడా నివృత్తి కొఱకై చెప్పెడి ఈ విషయమును సావధానుడవై వినుము.

శ్లో॥ ఇంద్రో దేవతా పూర్వ - దిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ తూర్పుదిక్కునకు దేవతయగు ఇంద్రునకు నమస్కారము. పూర్వదిగ్బంధన మగుగాక!

శ్లో॥ అగ్ని ర్దేవతా ఆగ్నేయదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ ఆగ్నేయదిక్కునకు దేవత అగ్నిదేవునకు నమస్కారము. ఆగ్నేయ దిక్కునకు బంధనమగుగాక!

శ్లో॥ నిఋతి ర్దేవతా నైఋతిదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హూం ఫట్

తా॥ నైఋతి దిక్కునకు దేవత నిఋతికి నమస్కారము. నైఋతి దిక్కునకు బంధనమగుగాక!

శ్లో॥ యమో దేవతా దక్షిణదిగ్భాగే నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్

తా॥ దక్షిణదిశకు దేవతయగు యమునకు నమస్కారము. దక్షిణ దిక్కునకు బంధనమగుగాక!

శ్లో॥ వరుణో దేవతా పశ్చిమదిశగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రర హుం ఫట్॥

తా॥ పశ్చిమదిగ్భాగమునకు దేవతయగు వరుణునకు నమస్కారము. పశ్చిమదిశకు బంధనమగుగాక!

శ్లో॥ వాయు ర్దేవతా వాయువ బగేగాది భ్యధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ వాయువ్య దిగ్భాగమునకు దేవతయగు వాయుదేవునకు నమస్కారము. వాయువ్యదిక్కునకు బంధనమగుగాక,

శ్లో॥ కుబేరో దేవహ ఉత్తరదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ ఉత్తర దిగ్భాగమునకు దేవతయగు కుబేరునకు నమస్కారము. ఉత్తరదిగ్బంధన మగుగాక ।

శ్లో॥ రుద్రో దేవతా ఈశాన్యదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ ఈశాన్యదిగ్భాగమునకు దేవతయగు రుద్రునకు నమస్కారము. ఈశాన్య దిగ్బంధనమగుగాక ।

శ్లో॥ విష్ణు ర్దేవతా ఊర్ధ్వదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ ఊర్ధ్వ దిగ్భాగమునకు దేవతయగు విష్ణువునకు నమస్కారము. ఊర్ధ్వ దిగ్బంధన మగుగాక ।

శ్లో॥ కూర్మో దేవతా పాతాళదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ పాతాళదిగ్భాగమునకు దేవతయగు కూర్మమూర్తికి నమస్కారము. పాతాళ దిగ్బంధన మగుగాక ।

శ్లో॥ భైరవో దేవతా అంతరిక్షదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ అంతరిక్ష దిగ్భాగమునకు దేవతయగు భైరవునకు నమస్కారము. అంతరిక్ష దిగ్బంధన మగుగాక ।

శ్లో॥ బ్రహ్మో దేవతా సర్వదిగ్భాగే బధ్నామి నమః
శ్రీ హనుమతే స్వాహా సహస్రార హుం ఫట్॥

తా॥ సర్వ దిగ్భాగములకు దేవతయగు బ్రహ్మకు నమస్కారము. సర్వ దిగ్బంధన మగుగాక.

శ్లో॥ షడక్షరో వా అస్త్రం చ - శక్త్యా త్యష్ట వర్ణకం
పాశుపతాస్త్రం పంచార్ణం - వ్యోమోఽస్త్రం చ శతార్ణకమ్॥

తా॥ ఈ అస్త్రము ఆరక్షరములు కలది. శక్త్యాస్త్రము ఎనిమిది వర్ణములు కలది. పాశుపతాస్త్రము ఐదక్షరములు కలది. వ్యోమాస్త్రము నూరు అక్షరములు కలది.

శ్లో॥ అఘోరాస్త్రం చ పంచాశ — దాంజనేయం చ షోడశ
సర్వాస్త్రేషు షడస్త్రాణి - శ్రేష్ఠాని సుమహాంతి చ॥

తా॥ అఘోరాస్త్రము ఏబది అక్షరములు కలది. ఆంజనేయాస్త్రము పదునారక్షరములు కలది. అన్ని అస్త్రములందు ఈ ఆరు చాల గొప్పవి.

శ్లో॥ తత్రాపి సుమహాశ్రేష్ఠ - మాంజనేయాస్త్ర ముచ్యతే॥

తా॥ అందును మిక్కిలి శ్రేష్ఠమైనదిగా ఆంజనేయాస్త్రము చెప్పబడుచున్నది.

శ్లో॥ వష డ్వశ్యే ఫ టుచ్చాటే - హుం ద్వేషే ఖే చ మారణే
ఠ స్తంభే వౌష డాకర్షే - ఇ త్యేవం మంత్రపల్లవాః॥

తా॥ 'వషట్' అనునది వశీకరణయందు, 'ఫట్' అనునది ఉచ్చాటనమునందు 'హుం' అనునది ద్వేషమునందు 'ఖే' అనునది మారణమునందు, 'ఠ' అనునది స్తంభనమునందు 'వౌషట్' అనునది ఆకర్షణయందు వినియోగింపబడు నివి మంత్రపల్లవము లనబడును.

శ్లో॥ ఆదౌ దిగ్బంధనం కుర్యాత్ - పశ్చా న్నివేశకర్మణి.
పిశా చోచ్చాటనం పశ్చా త్ప్రయోగనిపుణేన తు॥

తా॥ ముందుగ దిగ్బంధనము చేసిన పిదప నివేశకర్మనొనర్చి అనంతరము పిశాచోచ్చాటనము ప్రయోగ నైపుణ్యమున చేయవలెను.

శ్లో॥ ఇ త్యుక్తా శంభునా పూర్వం క్రియతే మంత్రవేదిభిః

తా॥ అని ఇట్లు శివునిచే పూర్వము చెప్పబడిన విధానము మంత్రవేత్తలచే ఆచరింపబడుచున్నది.

శ్లో॥ క్లీం వశ్యే మాయాకర్షేతు యముచ్చాటే తథైవ చ
హ్రీం స్తంభే చ రం విద్వేషే - మారణే వం తథైవ చ॥

తా॥ క్లీం బీజము వశ్యమునందు, మాయ. ఆకర్షణలయందు, 'యం' ఉచ్చాటనమునందు హ్రీం స్తంభనమునందు, 'రం' విద్వేషము నందు, వం మారణమునందు

శ్లో॥ వం శాంతే మోహనే లం చ - ఇత్యేతే ఆదిబీజకాః

తా॥ 'వం' శాంతమునందును 'లం' బీజము మోహనమునందును ఇట్లు ఇవి ఆది బీజములుగా చెప్పబడుచున్నవి.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - మైత్రేయ మునిసత్తమః
సంజపే ష్వనన్యమంత్రం - ప్రత్యహం శతసంఖ్యయా।

తా॥ ఓ మైత్రేయ మహామునీ! వేరొక విశేషమును చెప్పుచున్నాను. అనన్య మంత్రముగా ప్రతిరోజు వంద పర్యాయములు జపింపవలెను.

శ్లో॥ సహస్ర సంఖ్యాం గాయత్రీం -ప్రథమం ప్రజపే ద్బుధః
సహస్రం ప్రజపే దన్యే - మంత్రాంతర మథ ద్విజ॥

తా॥ పండితుడగువాడు ముందుగా సహస్ర సంఖ్యగా గాయత్రిని జపించవలెను. అనంతరము ఓ మైత్రేయా! ఇతర మంత్రములను సహస్ర పర్యాయములు జపింపవలెను.

శ్లో॥ అయుతం ప్రజపే ద్ధీమాన్ - గాయత్రీం వేదమాతరం
ఏవం దశగుణాధిక్యం - జపాంచ్చే ద్వేదమాతృకాం
మంత్రాంతరస్య జప్తస్య - సిద్ధిం దద్యా ద్వృథేప్సితామ్॥

తా॥ వేదమాతయగు గాయత్రి జపము పదివేలు చేయవలెను. ఈ రీతిగా ఆయా మంత్రముల కంటె పదిరెట్లధికముగా గాయత్రిని జపించినచో జపింపబడిన అన్యమంత్రము సిద్ధించి కోరిన కోర్కె నెర వేరును.

శ్లో॥ యది నైవం కృతా దేవీ - గాయత్రీ పూర్వసంఖ్యయా
మంత్రాంతరం చిరం జప్తం -క్షణే నైవం భవిష్యతి॥

తా॥ ఆ రీతిగా పూర్వసంఖ్యతో గాయత్రీ మంత్రమును జపించకున్నచో ఎంత కాలము జపించినను అన్యమంత్రమాక్షణమునందు సిద్ధినందుట జరగదు.

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన - ప్రత్యహం మునిసత్తమః
సహస్రం వా శతం వాసి - అష్టావింశతి మేవ వా
గాయత్రీం ప్రజపే ద్ధీమాన్ - న చాతో న్యూనతోభవత్

తా॥ కావున ఓ మైత్రేయ మునీః సర్వధా యత్నించి ప్రతిదినము వేయి పర్యాయములు కాని, వంద పర్యాయములు కాని, ఇరువది యెనిమిది పర్యాయములు గాయత్రీ జపమును బుద్ధిమంతుడగువాడు చేయవలెను. అంతకంటె తక్కువ చేయరాదు.

శ్లో॥ న గాయత్ర్యాః పరో మంత్రో - న మాతుః పరదైవతం
న వివేకా త్పరో బంధుః - ఇతి వేదవిదో విదుః॥

తా॥ గాయత్రికంటె ఉత్తమమైన మంత్రము లేదు. తల్లిని మించిన దైవము లేదు. వివేకమును మించిన బంధువు లేదు, అని వేదవేత్తలగు వారు చెప్పుదురు.

శ్లో॥ గాయత్రీం బహుధా జప్త్వా - సిద్ధిం ప్రాప్నోతి జాపకః॥

తా॥ గాయత్రీ మంత్రమును పలుమార్లు జపించుటద్వారా జపమొనర్చువాడును మంత్రసిద్ధిని పొందగలును.

శ్లో॥ సహస్రపరమాం దేవీం - శతమధ్యాం దశపరాం
త్రిసంధ్యం చ జపే న్నిత్యం - గాయత్రీం వేదమాతరమ్॥

తా॥ పూర్వసంధ్యయందు సహస్రమును, మాధ్యాహ్నికమున వందపర్యాయములు, సాయం సంధ్యా సమయమున దశపర్యాయములుగా వేదమాతయగు గాయత్రిని మూడువేళల ప్రతిదినము జపించవలెను.

శ్లో॥ గాయత్రీం స్వల్ప కృత్వా తు - తన్మంత్రం భక్షయే ద్విదః

తా॥ గాయత్రిని స్వల్పముగా చేసినచో అది జాపకుడు చేయు మంత్రమును భక్షించును.

శ్లో॥ మంత్రాంతరం ప్రవక్ష్యామి - శృణుష్వ మునిపుంగవః
త్రయోవింశ త్యక్షరోఽయం - మంత్రాణా ముత్తమోత్తమమ్

తా॥ ఓ మునిశ్రేష్టా! వేరొక మంత్రమును చెప్పుచున్నాను వినుము ఇరువది మూడక్షరములు కల ఈమంత్రము మంత్రములన్నిట శ్రేష్ఠమైనది.

గ॥ అస్య శ్రీ హనుమన్మంత్రరాజ మహామంత్రస్య అగస్త్యభగవాన్ ఋషిః గాయత్రీ ఛందః శ్రీ హనుమాన్దేవతా, ఓం బీజం స్వాహా శక్తిః నమః కీలకం మమ సకలాభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః॥

తా॥ ఈ శ్రీహనుమన్మంత్రరాజమను మహామంత్రమునకు అగస్త్యుడు ఋషి: గాయత్రి ఛందస్సు, శ్రీ హనుమానుడు దేవత, ఓం బీజము. స్వాహా శక్తి, నమః అనునది కీలకము. సకలాభీష్ట సిద్ధికై జపమున వినియోగము చెప్పవలెను.

న్యాసము- ఓం అంగుష్ఠాభ్యాం నమః నమో భగవతే తర్జనీభ్యాం నమః ఆంజనేయాయ మధ్యమాభ్యాం నమః మహాబలాయ అనామికాభ్యాం నమః హనుమతే కనిష్ఠికాభ్యాంనమః స్వాహా కరతల కరపృష్ఠాభ్యాం నమః ఏవం హృదయాదిన్యాసః-ఇట్లు అంగన్యాస కరన్యాసముల గావింపవలెను.

ధ్యానం-

శ్లో॥ వందే బాలాదివాకర ద్యుతి నిభం దేవారి దర్పాపహం
దేవేంద్ర ప్రముఖామరార్చిత పదం సీతాతిశోకాపహం
మౌంజీరత్న విచిత్రకుండల లసత్కౌపీన కృష్ణాజినం
వజ్రప్రాయ మహాబలం కపివరం శ్రీరామ సేవారతమ్॥

తా॥ ఉదయసూర్యుని కాంతితో సమానమైనవాడును, రాక్షసుల గర్వమణచువాడును, దేవేంద్రాది ప్రముఖులచే పూజింపబడు పాదములు కలవాడును జానకియొక్క దుఃఖమంతటిని పోగొట్టువాడును ముంజత్రాడు రత్నములచే విచిత్రమైన కుండలములు, ప్రకాశించు కౌపీనము, కృష్ణాజినము కలవాడును, వజ్రాయుధముతో సమానమైన గొప్ప బలసంపద కలవాడును, వానర శ్రేష్ఠుడును, శ్రీరామసేవాతత్పరుడును అగు హనుమంతునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - నమో భగవతే పదం
అంజనేయాయ శబ్దం చ - మహాబల పదం తతః॥

తా॥ మొదట ప్రణవము నుచ్చరించి 'నమోభగవతే అని 'అంజనేయాయ' శబ్దముంచి పిదప మహాబల పదమునుంచవలెను.

శ్లో॥ యకార ముచ్చరే ద్ధీమాన్ - పశ్చా ద్ధనుమతే పదం
వహ్నిజాయాం సముచ్చార్య - మంత్రరాజ ఇతి స్మృతః॥

తా॥ పిమ్మట బుద్ధిమంతుడగువాడు యకార ముచ్చరింపవలెను. అనగా మహాబలాయ అనవలెను. అనంతరము హనుమతే పదమునుంచి స్వాహా అని ఉచ్చరించిన అది మంత్రరాజమగును.

శ్లో॥ త్రయోవింశ త్యక్షరాఢ్యో - మంత్రోఽయ మితి కథ్యతే
హనుమ న్మంత్రజాలేషు - జపతాం శీఘ్రసిద్ధిదః

తా॥ ఇది ఇరువది మూడక్షరముల గొప్ప మంత్రముగా చెప్పబడు చున్నది. ఇది హనుమన్మంత్ర సమూహమునందు శీఘ్రముగా సిద్ధించునది.

శ్లో॥ పురశ్చర్యా క్రమం వక్ష్యే - లక్షత్రయ మతం దితం
తర్పణం తద్దశాంశం తు- నియమేన సమాచరేత్॥

తా॥ పురశ్చర్యా క్రమము చెప్పుచున్నాను. నియమముతో మూడు లక్షలు జపము చేయవలెను. అందు పదవవంతు తర్పణ గావించవలెను. ఈ రీతిగా నియమముతో ఆచరించవలెను.



శ్లో॥ త ద్దశాంశం హునే ద్విద్వాన్ - పాయసం త్రిమధుప్లుతం
పంచవింశతి సంఖ్యాకాన్ - బ్రాహ్మణాన్ భోజయే త్తతః॥

తా॥ తర్పణమునందు పదవవంతు త్రివిధ మధువులతో తయారు చేసిన పాయసముతో హోమము చేయవలెను. అనంతరము ఇరువది యైదు మంది శ్రోత్రియులకు అన్న సమారాధనము గావింపవలెను.

శ్లో॥ గురుపూజా విశేషేణ - కర్తవ్యా మంత్రవేదిభిః
ఏవం యః కురుతే యోగీ - మంత్రసిద్ధిర్భవే న్నృణామ్॥

తా॥ మంత్రవేత్తలగు వారిచే విశేషముగా గురుపూజ గావింపబడవలెను. చిత్తవృత్తులను నిరోధింపజాలి ఎవడిటు చేయునో అట్టి వానికి మంత్రసిద్ధియగును.



గ॥ మధ్య మానామి కాంగుష్ఠే హృదయాయ నమో న్యసేత్ అథోము ఖాంగుష్ఠాగ్రే శిరసే స్వాహా అంగుష్ఠ మధ్య మానామికాభిః

శిఖాయై వషట్ - కరద్వయాంగుళిభిః కంఠాది నాభి పర్యంతం కవచాయ హుం - తర్జనీ మధ్య మానామికా నేత్రత్రయాయ వౌషట్ - కరద్వయాంగుష్ట మధ్యమాధ్వనినా దిక్షు అస్త్రాయ ఫట్ — ఇతి హృదయాన్యాసః

తా మధ్యవేళ్లు, ఉంగరపువేళ్లు బొటనవేళ్లులతో హృదయము తాకుచు న్యాసము గావింపవలెను. క్రిందివైపు త్రిప్పిన బొటన వేలికొనతో శిరస్సును చూపుచు బొటనవేలు మధ్యవేళ్లు వుంగరపు వేళ్లులతో శిఖను చూపుచు రెండు చేతుల వేళ్ళతో కంఠము మొదలుకొని బొడ్డువఱకు కవచము చూపుచు చూపుడువేళ్లు, మధ్యవేళ్లు, ఉంగరపు వేళ్లులతో నేత్రముల చూపుచు రెండుచేతుల బొట్టనవేళ్లు మధ్యవేళ్లులధ్వనితో ధ్వని చేయుచు ఇట్లు హృదయన్యాసము గావింపవలెను.

శ్లో॥ చతుర్వర్ణైస్తు హృదయం - చతుర్భి శ్శిర ఉచ్యతే
పంచభి శ్చ శిఖాయాం తు - త్రిభిః కవచ మేవ చ
నేత్రత్రయం చతుర్భి శ్చ - అస్త్రం శేషాంగకం విదుః॥

తా చతుర్వర్ణములతో హృదయమును అట్లే శిరస్సును, పంచ సంఖ్యతో శిఖను, మూటితో కవచమును నాల్గింటితో నేత్రత్రయమును ఇట్లు న్యాసాదికము గురు నాదేశానుసారము గావింపవలెను.

శ్లో॥ ఇత్థం గాయత్రి మంత్రస్య - అంగన్యాసాదికం విదుః
దశ ప్రణవ యుక్తా శ్చ - ప్రాణాయామా శ్చతుర్దశ
ముచ్యతే బ్రహ్మహత్యాయాః — కిం పున శ్శేషపాతకైః ॥

తా॥ ఇట్లు గాయత్రి మంత్రమునకును అంగన్యాసాదికమును చెప్పుదురు. పది ప్రణవములు పదునాల్గు ప్రాణాయామములు గావింపవలెను. అట్లు చేయుటవలన బ్రహ్మహత్యనుండి కూడ విముక్తి కల్గును. ఇక ఇతర పాపములను చెప్పవలసినదేమి?

ఇతి శ్రీపరాశరసంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
సంతాన హనుమన్మంత్ర ప్రభావ అస్త్రప్రయోగ కథనం నామ
అశీతిః పటలః

---

**త్వరలో తదుపరి భాగము వెలువడును.**